# Telugu-Poetry-Writing Made-Easy.

*Useful for Beginners*
*and High School Students*



BY

K. KODANDA RAMIAH,
*Author of Sowgandhikapaharanam,*
*&c. &c. &c.*

Printed at the Vani Press, Bezwada.

1919.



Price As. 8

# Telugu - Poetry - Writing
# Made - Easy.

## కవిత్వతత్త్వము

కవిత్వ మభ్యసించువారలకు

హైస్కూలు విద్యార్థులకు నుపయుక్తము.

కల్లపాలెం కోదండరామయ్యచే

రచియింపఁబడి, ప్రచురింపఁబడెను.

500 ప్రతులు.

బెజవాడ వాణీముద్రాక్షరశాలయందు

బి. కే. స్వామిచే ముద్రింపఁబడియె.

1919.



వెల 8 అణాలు

# విజ్ఞప్తి.

చదువరులారా!

నాస్నేహితులలో నొకరు పద్యరచన నేర్చుకొననిచ్చగించి నన్ను నేర్పుఁడనియడుగఁగా, నాకంతటిశక్తిచాలకున్నను, సుహృదభిలాష నెరవేర్తమను నుత్సాహమున నప్పకవీయాది లక్షణగ్రంథసహాయమున, నా నేర్చుకొలఁది నామిత్రునకుఁ దెలిపితిని. నేఁ జెప్పిన యంశములనన్నింటిని నాయన యొకపుస్తకమున వ్రాసికొనుచువచ్చెను. అట్టుల వ్రాసిన యా వ్రాతప్రతినిఁ జూచిన కొందఱది సులభముగనున్నదనియు, దానిని ముద్రింపించిన లక్షణము నేర్చుకొనఁదలచువారల కుపకరించుననియు నాతోఁ బలుమారు పలుకుటచే దాని నీపుస్తకరూపమున ముద్రింపించి ప్రచురపరచితిని. నాకించిత్ జ్ఞతచే నిందు దొరలిన లోపంబులకుఁ బెద్దలు మన్నించి, నాకుఁ దెలిపినచో, నింకొకకూర్పున వానిని సవరించుకొనియెద.

ఈపొత్తమునచ్చొత్తించుటకు సరిపడుకాగితమును నాకుచితముగ నొసంగి దీని వెలువడఁ జేయుటయందు సహాయ మొసంగిన నామిత్రులు శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్యపంతులుగారికి నావందనశతంబు లర్పించుచున్నాఁడ. ఇట్టివీరివిద్యాపోషణానురక్తి నూతనముగాదని యీలోక మెఱుంగు. ఆంధ్రలోకోద్ధరణమైకై భాషాసేవఁ జేయుటకుఁ బ్రథమసోపానమగు గ్రంథాలయవ్యాప్తియందు యావజ్జీవము ధారవోయుచు, నహోరాత్రములాతత్వమునే మననముఁ జేయుచున్న వీరిపట్టుదలయే యందుకు సాక్షి. వీరికిఁ బరమేశ్వరుండు పుత్రపౌత్రాయురారోగ్యైశ్వర్యముల ననవరత మొసంగుఁగాత.

ఇట్లు విధేయుఁడు,

బెజవాడ,
1-1-1919.

☞ కర్లపాలెం కోదండరామయ్య,
గ్రంథకర్త.



శుభమస్తు.

శ్రీశారదాంబాయైనమః.

# కవిత్వతత్త్వము.

## 1 వ. ప్రకరణము.

ఏదైన నొకవిషయమును జక్కని స్వకపోలకల్పితము లగు కల్పనలతో మేళవించి, సరసపద సముదయముచే, భావము స్ఫురించునటులఁ బలుకుట కవిత్వమనఁబడును. కవిత్వము ఛందోవ్యాకరణనియమబద్ధమును, సముచితాలంకార శోభితమును నై చెలువొందును. అది "పదరచన," "పద్యరచన"యనునిరుదెఱఁగులఁ బ్రకాశించుచుండును. వచనరచనకు వ్యాకరణమును, పద్యరచనకు ఛందోవ్యాకరణములు రెండును బాటింప నవసరము. ఇటుల ఛందోవ్యాకరణములను బాటించి కవితారచన మొనర్చు విధానమును బోధించుపద్ధతికి "లక్షణ"మనిపేరు. ఆలక్షణమును సులభముగఁ దెలియఁజేయునది యీ "కవిత్వతత్త్వము."

పద్యములు పదములవలనను, పదము లక్షరములవలనను నేర్పడుచున్నవి. కవితానియమములనుదెలుపు లక్షణగ్రంథములయం దక్షరములు గురువులనియు, లఘువులనియు ద్వివిధముగ విభజింపఁ బడినవి.

## గురు లఘువులు.

I గురువులు:—"గురు"వనఁగా గొప్పదియనియర్థము. అనఁగా నిందుఁబలుకుటకు గొప్పగ (అనగా దీర్ఘముగ) నుండు నది యనితాత్పర్యము.

ఆ-ఈ-ఊ-ౠ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ-యాదీర్ఘాచ్చులును, వీనింగూడిన హల్లులును, పూర్ణబిందువులతోఁగూడిన యక్షరములును, విసర్గలతోఁగూడినవియు, ద్విత్వసంయుక్తాక్షరములకు ముందుండెడు వర్ణములును, నకారపొల్లు(న్) నుగూడినవర్ణములును, హల్లాంత్యవర్ణము (త్ &c ) లనుగూడినవియు, గురువులు.

ఉదా:— ఆ, కా, కం, కః, కన్ను, విద్య, కన్, రాట్.

సూత్రము:—గీ॥ నిడుదలగు ప్రాణులును వానిఁ ♦ బడసినట్టి
ప్రాణములు, ద్విత్వసంయుక్త ♦ వర్ణములకు
ముందువి, విసర్గహల్లాంత ♦ పూర్ణబిందు
ప్రాతయుతంబులు గురువులై ♦ క్షితినిఁ జెలఁగు॥

II లఘువులు:— "లఘువు" అనగాఁ దేలిక. అనఁగా నిందుఁదేలికగాఁ బలుకఁబడు వర్ణమనియర్థము.

అ-ఇ-ఉ-ఋ-ఌ-ఎ-ఒ- యీ హ్రస్వాచ్చులును, వీనిం గూడిన హల్లులును, లఘువులనఁబడును. ఉదా:— అ. క-కృ.

గమనింపు:—(1)ఋకారమచ్చు. కావున దానింగూడిన హల్లులు సంయుక్తాక్షరములుకావు. అందుచేనాయక్షరమునకుఁ బూర్వమునఁగల వర్ణము గురువుకానేరదు. ఉదా:— పితృ.

(2) ఊఁదిపలుకని సంయుక్తాక్షరములకు ముందుండెడువర్ణములు లఘువులుగనే యుండును.

ఉదా:—1. అతఁడు స్వయంభువు. (ఇందు "డు" లఘువు).

2. నా! ఆరామామునిమీఁది ప్రేమమున ("ది" లఘువు)

(3) ద్విత్వ సంయుక్తాక్షరములు, దీర్ఘాచ్చులఁగూడి యుండుట మొదలగు గురులక్షణములఁ గూడియుండనిచో లఘువు లేకాని గురువులుకానేరవు.

(4) "మాత్ర" యనఁగా రెప్పపాటు కాలమున నుచ్చరింపఁబడఁగలవర్ణము. ఇందులఘువొక మాత్రయనియు, గురువు రెండుమాత్రలనియు వ్యవహరింతురు.

| | | |
|---|---|---|
| (5) గురువునకు గు. ◡ | } | ఇవి సంజ్ఞలు. |
| లఘువునకు ల. । | | |

---

2 వ ప్రకరణము.

## గ ణ ము లు.

"గణము" అనగా సమూహమని యర్థము. ఇందు (నియతములగు) గురులఘువుల చేరికవలన గణము లేర్పడుచున్నవి.

ఈగణములు నిసర్గగణములనియు, నుపగణములనియు ద్వివిధము. అందు

A. నిసర్గగణములు:—

(1) ఏకాక్షరగణములు 2. గు ◡ (శ్రీ). ల । ను.

(2) ద్వ్యక్షరగణములు 4.

| | |
|---|---|
| గగము ◡◡ గాణి | వగణము లేక లగము । ◡ రమా |
| లలము ।। సతి | హగణము లేక గలము ◡ । గాము |

(3) త్ర్యక్షరగణములు 8.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మగణము | U U U | శ్రీరామా | నగణము | I I I | శివుడు |
| యగణము | I U U | గిరీశా | భగణము | U I I | ధారుణి |
| రగణము | U I U | రుక్మిణీ | జగణము | I U I | మహేంద్ర |
| తగణము | U U I | ధాత్రీశ | సగణము | I I U | కమలా |

సూత్రము:-శ్లో॥ ఆదిమధ్యావసానేషు య,ర,తా యాంతి లాఘవం । భ,జ,సా గౌరవం యాంతి; మ, నౌ తు గురులాఘవౌ॥

తా॥ ఆదిని, మధ్యను, అంత్యమున, వరుసగా లఘువును గలిగినచో య,ర,త గణములును, అవే గురువులైనచో భ,జ, స గణములును, అన్నియు గురువులైన మగణమును, లఘువులైన నగణము నగును.

B ఉపగణములు:—

(1) సూర్యగణములు 2.

హగణము U I రామ. నగణము I I I నృపతి.

(2) ఇంద్రగణములు 6

| | | | | | |
|---|---|---|---|---|---|
| నలము | I I I I | మురహర | భగణము | U I I | శ్రీపతి |
| [illegible] | I I U | [illegible] | రగణము | U I U | భూపతీ |
| సలము | I I U I | గణనాథ | తగణము | U U I | వారాసి |

(3) చంద్రగణములు 14

| | | | | | |
|---|---|---|---|---|---|
| రగురు | U I U U | కోమలాంగా | సహము | I I U U I | దివిజాధీశ |
| నగగము | I I I U U | కమలనాభా | రలము | U I U I | మానిచంద్ర |
| తగము | U U I U | రామామణీ | నహము | I I I U I | ఖగదులేశ |
| సవము | I I U I U | త్రిపురాంతకా | తలము | U U I I | రాధాపతి |
| భగురు | U I I U | శ్రీరమణీ | భలము | U I I I | శ్రీలలన |
| నవము | I I I I U | దనుజహరా | సలలము | I I U I I | మనుజాధిప |
| మలఘు | U U U I | శ్రీలక్ష్మీశ | నలలము | I I I I I | మనుజవర |

సూత్రము:- క॥ తగ న, హాములు రవు; లింద్రులు
నగ,నల,సల,భ,ర,త ; లింక ♦,నలల,తగ,సలా
నగగ, మలఘు, నవ, తల, సహా
భగురు,రగురు,సహా,సవ,రల,♦ భల,లిందులగుఁ॥

---

3 వ ప్రకరణము.

## ప్రాసములు.

(1) "ప్రాసము" అనగా నొకపద్యపాదద్వితీయవర్ణము.

(2) ఒకపద్యమునఁ బ్రథమపాదద్వితీయవర్ణ మేహల్లు, లేక, యేహల్లులఁగూడియుండునో, దానితక్కినపాదములఁగూడ నట్టివేయుండవలయును.

(3) ప్రథమప్రాసాక్షరముద్విత్వమైనచోఁ దక్కినపాదములకు నట్లేయుండవలెను. సంయుక్తమైననునట్లేయుండవలెను.

(4) ప్రాసవర్ణమునకు హల్లుప్రధానమేకాని యచ్చు ప్రధానముగాదు. కావున నొకపద్యముయొక్క వేరువేరుపాదముల ప్రాసము లొకేవిధమగు నచ్చుఁగలవిగఁగాని, లేకవానిమిత్రవర్గములో నొకదానిఁగలవిఁగఁగానియుండవలెననువిధిలేదు.

(5) అఱసున్నతోఁగూడినవర్ణముతో శుద్ధవర్ణము ప్రాసముగ నిల్వవచ్చును.

(6) బిందుపూర్వమగు వర్ణమునకు బిందుపూర్వ వర్ణమే కడవెళ్ళ నిలుపవలెను.

(7) బిందుపరమగు వర్ణమునకు దీర్ఘాక్షరమూ ప్రాసముగా జెల్లును.

(8) ప్రావడిగలవర్ణములకు శుద్ధవర్ణము ప్రాసముఁ జేయవచ్చును. ఉదా:— శా॥ ఈత్రైలోక్యమునం దుఁగల్గఁడు రణం♦బెచ్చోటలేకుంటగాఁ। జేతుల్వేఁయు వృధాభరంబగుచు॥ సా.హ.

(9) ప్రావడిగల వర్ణములకు వట్రువసుడిగల వర్ణము ప్రాసమొప్పును. ఉదా—: ఉ॥...సచా।రిత్రము దప్పకుండఁగఁబ♦రిక్షితుకాచినయట్లు రామమా। ధాత్రిరఘుక్షితీశులు॥ భా. ఆ.

(10) ప్రమతమునకుగానువచ్చిన పూర్ణబిందువు పూర్వమునఁగల వర్గయుక్సరళములందొకవర్ణమునకుఁ బదమధ్యపుపూర్ణబిందుపూర్వంబగునావర్ణంబులకుఁ బ్రాసముఁ జేయనొప్పును. ఉదా:— శా। గంగానందను పోటుమెచ్చకగురుంగాదంచునా ధాతనూ। జుంగీటాడుచునీతఁడెవ్వఁడో కొయంచుఁ॥ (భా. శ.)

(11) లావత్తుగలవర్ణములకు శుద్ధవర్ణము ప్రాసము జేయవచ్చును. ఉదా: — శా॥ లోకత్రాణరతిందదాదిమమహాలోకప్రవేశోత్కభా। పాక్షిప్తప్రథమద్వితీయ॥ (రా. పాం.)

(12) ధ, థలకుఁ బ్రాసము చెల్లును. ఉదా:— క॥ గంధవహాసుతుఁడు గవయుఁగ। మంథరగతి నెవ్వఁడు గు॥— భా. ద్రో.

(13) ద-ధలకుఁ బ్రాసము చెల్లును. ఉదా:-ఉ॥ కాదనకిట్టిపాటి యుప♦కారముతత్కుఁడేకవిప్రసం। బోధనఁ జేసి॥ భా. ఆ

(14) వట్రువసుడిగలవర్ణమునకు శుద్ధవర్ణము ప్రాసము జేయవచ్చును. ఉదా:— మ॥ ఘనశౌర్యంబును సింగరాయనరలో♦కస్వామికిఁ బుట్టి రా। మనృపాలాగ్రణి... ॥ (వసు)

(15) సంధిలోమార్పుఁజెందినిలిచిన వర్ణమునకు శుద్ధవర్ణము ప్రాసముగ నిల్పఁజెల్లును. ఉదా:-మ॥...విశే।షంబునుతింపఁగాఁగలర♦సజ్ఞరసజ్ఞభవద్విభావనా। ప్తింబరిపూర్ణమై॥ వ. సు.

(16) "ఋ-ర"లకుఁ బ్రాసము చెల్లును-ఉదా:—క॥ ఆ ఋషిపుత్రుఁడు గట్టిన । చీరలు మృగులములు......॥ (భా-అ)

(17) "అ-ర"లకుఁ బ్రాసముఁ జేయనగు. ఉదా:— క॥ చర్లాటమాఁడు మోహము। లేదైవర్త్రిల్లు నమ్మహీసురుఁ...ఁడ...॥ పాం.

ఈప్రాసముఁ గూర్పరాదని యప్పకవి చెప్పియుండెం గాని, పూర్వకవి ప్రయోగములు కాన్పించుటచేతను, ఆధునికకవులు విరివిగా వాడుటచేతను, నుచ్చరించుటయం దంతగా భేదము గానుపింపమిని నీప్రయోగము గ్రాహ్యమే యగు.

(18) తమంతఁ దాము ద్విత్వంబులైనవానితోఁ బ్రాసము లోపలఁగలిగి సంధివశమున ద్విత్వములుగ నేర్పడునవి ప్రాసముగ నుండవచ్చును. ఉదా:—ఉ॥ మున్ను గనన్న గాత్మజకు ముద్రికపైఁ బతిపేరు సూడఁదోఁ। చెన్నుపుఁ జూచినట్లు...॥ (వసు)

(19) ల-ళలకుఁ బ్రాసము చెల్లును. ఉదా:—చ॥ కలికలు లేజగుళ్ళునవ కంపుటనంటులు కప్పురంపుతీ। ప్పలు ననగుత్తులుఁ ...॥ (వసుచ)

(20) యడాగమమున వచ్చిన యకారమునకు లఘు యకారము ప్రాసముగఁ జెల్లును.

(సంధిలేనిచోట నున్న అకారమునకు యకారము వచ్చుట యడాగమ మనంబడు. లఘుయకారమన పుట్టుకతో నున్న శుద్ధవర్ణము)

ఉదా:—ఉ॥ ఆయమెడ నొక్క నర్మసచి వాగ్రణి యిట్లను నోయ ఖండతేజో యుతయద్భుతం బొకటి చూచితి... ॥ (వసుచ)

(21) ఒకేయనునాసికమును గూడినప్పుడు క-చ-ట-త-ప వర్గములయొక్క వట్రపొల్లు లాయావర్గముల మూఁడవయక్షరమునకుఁ బ్రాసముగ నిలువఁ జెల్లును. ఉదా:— గీ॥ దిఙ్మహీంతకీర్తి యజ్ఞన యుగ్మభేది ॥ (అప్పకవి)

(22) ంబ-మ్మలకు బ్రాసము చెల్లును. ఉదా:— గీ॥ కమ్మ తావులు వెదజల్లు నంబుజములు ॥ (అప్పకవి)

గమనింపు:— ఈ 21, 22 సూత్రములయందుఁ జెప్పిన రెండు ప్రాసము లప్పకవీయమునందే కనఁబట్టుచున్నవి. కానియితరపూర్వకవిగ్రంథములనెందును నిట్టి ప్రయోగములు గాన్పించుటలేదు.

(23) స-షలకుఁ బ్రాసము చెల్లుననుటలో షకారముగలపదమునకు సకారముగల రెండవరూపముగూడ నుండిననేయొప్పునుగాని లేకున్న నొప్పదని కొందఱయభిప్రాయము. అందున కుదాహరణముగ సాంబవిలాసములోని

"క॥ విసరాంబుజమిత్రునకు న్విషమశిలీముఖసహస్రనిభగాత్రునకున్ ॥" అను పద్యముగూడ వారివాదముననే బలపరచుచున్నది. ఎట్లనిన "విషము" అనుపదమునకు "విసము" అను రెండవరూపముగూడనున్నది. కావున స-షవర్ణములయందొకటి ప్రాసముగనున్నప్పుడు రెండవవర్ణముగలిగినట్టియు, నదేరూపముగల్గి రెండవరూపము లేనట్టియు, పదము ప్రయోగింపఁబడినట్లు సనాతనాంధ్రగ్రంథములనుండి యుదాహరణములు దొరకువరకు నిట్లేయుపయోగింపవలసియుండును.

(24) న-ణలకుఁ బ్రాసము చెల్లును. కానిదీనికిఁ గొన్ని భేదాభిప్రాయములుగలవు. అవియెవ్వియన:— ణవర్ణముగలపదములోని ణవర్ణమునకుఁ బూర్వమునగలవర్ణము ఱ్రావడిఁ గలదిగనుండిననేగాని లేకున్నఁ జెల్లదని కొందఱియభిప్రాయము. కాని యప్పకవియుదాహరణముగనిచ్చిన శృంగారషష్టకములోని క॥ వినుమతిగుహ్యము నారా। యణకవచము భక్తవాంఛితార్థప్రదమై ॥ యనుపద్యముంజూడ వారియభిప్రాయమునకు వ్యాఘాతముకన్పడుచున్నది. కానిమఱికొందఱియభిప్రాయముగు "సంధికిఁ బూర్వము నవర్ణముకలిగినఁగాని, లేక నవర్ణముగలిగిన మరియొకరూపముండినఁగాని నవర్ణమునకు ణవర్ణము ప్రాసము గఁ జెల్ల" దనునది సమంజసముగఁ గన్పడుచున్నది. ఏలయన

నప్పకవి తానుదాహరణముగనిచ్చినవితప్ప తక్కినసనాతనాంధ్రగ్రంథములనుండి గైకొనిన యుదాహరణములన్నియు నీవాదమును స్థిరపరచుచున్నవి. కావున నీవిధముగాఁ బ్రయోగించుటయే యొప్పిదము.

(25) ల-డలకుఁ బ్రాసము చెల్లును. ఉదా:— చ॥ చిలుకలుకూయునో చెవులు♦చిల్లులువోవఁగనంచు నెన్నఁడు। న్వేడలఁడునందునో ... ॥(ఆంధ్రనై)

ల-డలకుఁ జెల్లుననుటలోఁగూడ, స-షలకు విధించిన ప్రకారమే చూచిప్రయోగించవలెను పైయుదాహరణముగూడ నీవాదమునే స్థిరపరచుచున్నది. ఏలయన "వెడలు" నకు "వెలలు" అను రెండవరూపముగూడఁగలదు.

(26) ద-డలకుఁ బ్రాసము సేయవచ్చును. సులక్షణసారగ్రంథకర్త "క॥ ద-డలకు భేదములెన్నక।వడియును బ్రాసంబులిడఁగ♦వచ్చును కృతులన్"॥అనిస్పష్టముగఁ బలుకుచున్నాఁడు. మరియు శ్రీనాథుని వీధినాటకమున "ఉ॥ కందుక కేళిసల్పెడి ప్ర♦కారమునం బురుషాయితక్రియా।తాండవ కేళిసల్పెడివి♦ధంబున॥" నని ప్రయోగము కాన్పించుచున్నది. మరియు నప్పకవి యీప్రాస మప్రశస్తమని చెప్పుచు "ఉ॥ నిడుకొనివేడి బాష్పములు♦గ్రమ్మిపయింబడి పర్వభీతిమై। నడరుచువిన్ననైనహ్రద♦యంబునఁబొల్పగు హారయష్టిపై।య్యెదదడియఁగ ...... " అని రామాయణమునుండి యెత్తి వ్రాసినాఁడు. కాని, స-ష, ల-డ, న-ణలకువలె "రెండురూపములుకలిగిగాని, లేకవృత్తికిఁబూర్వముతక్కినపాదములఁగల ప్రాసాక్షరమువంటివర్ణముకలిగిగాని" యుండనటువంటి పదప్రయోగములు పై యుదాహరణముల రెంటియందుఁగన్పడుచున్నవి కావున ద-డలకుఁ బ్రాసము చెల్లును.

(27) రధరభస్వేదనేధాతుయోగమైనప్పుడుమాత్రము లవర్ణమునకు రవర్ణము ప్రాసముగఁ జెల్లునుగాని, లేకున్నఁ జెల్లదు. ఉదా: శా॥... క।స్తూరీచర్చనెపంబునన్ దనదు కేళీగోపకా సువర్ణత్వేశే। ఖాలిప్సకై శశికి త్రిఁజూపసతేఁదు ...॥ (కాకు).

---

## 4 వ ప్రకరణము.

# యతులు.

“యతి”యనఁగాఁ బద్యచరణాదిమవర్ణముతోడఁ బాదమధ్య నియమితస్థానమున నుండెడివర్ణమునకు సంబంధముఁ గూర్చుట.

యతి యను పదమునకు సమానార్థపదములు:—విరతి, విశ్రాంతి, విశ్రామము, విరమణము, విరామము, విరమము, వళి, వడి, శ్రాంతియనునవి.

స్వరయతులనియు, వ్యంజనాక్షరయతులనియు, నుభయయతులనియు యతులుమూఁడువిధములు. అందు

1 స్వరయతులు:—

(1) స్వరమైత్రివళి:—అ-ఆ-ఐ-ఔలును; ఇ-ఈ-ఋ-ౠ-ఎ ఏ-లును; ఉ-ఊ-ఒ-ఓ లును దమలోదాము సంబంధములుగ యతిస్థానములనిల్చును. ఉదా:— చ॥ ఒనర హిమావకుంఠనములూఁడ్చి తెమల్చినపత్త్రిభంగముల్॥ (వసుచ)

(2) స్వరప్రధానవళి:— ఒకశబ్దముయొక్క అంత్యలఘువు సంధివశమునఁ దరువాతి యచ్చుతోఁ గూడినప్పు డా యచ్చునకే యతిఁ గూర్పవలెఁగాని హల్లునకుఁ గూర్పరాదు. ఉదా:— మ॥ అరవిందోదరమూర్తి భానుఁడపు డాశాప్రాంతంబుగా సంకుచత్ ॥ (వసు)

(3) లుప్తవిసర్గస్వరవళి:— సంస్కృతభాషయందుఁ గల అదంతసాంతశబ్దములతో, అత్తు మొదటఁగలశబ్దములు సంధి జేసినప్పుడు ప్రాప్తమైన ఓత్వమునకు అ-య-హాలు చెల్లును. ఉదా:— A. ఉ॥... అన్యోన్యవిరుద్ధభాషణము ♦ లాడినఁద ద్బలమాతఁడం దెడిఁ ॥ (భా.వి.) B శా॥ ... బా। హాపాట చ్చరరామదాసతవదా♦సో హమ్మరున్నందనా॥ (మ-శ)

(4) ఋవళి:—ఋవర్ణముతోఁగాని, ఋకారముగలయితర రహల్లుతోఁగాని ఇత్వైత్వములఁగూడిన రవర్ణముయతిగానఁబుకి వచ్చును. ఉదా:— A. సీ॥ ఋత్విజుండన విచా♦రించిపూజించి తే॥ (భా-స). B. శా॥ శ్రీవజ్రాంగియజాతశత్రుఁడు మహీ ♦ భృన్మాత్రుఁడేచూడఁగన్ ॥ (విజ)

(5) ఋత్వసంబంధవళి: — అ-య-హ లు ఇత్వైత్వములఁగూడి ఋకారముకు యతిఁగూడఁజెల్లును.

ఉదా:—సీ॥ ఇచ్చియిష్టాన్న సం♦తృప్తులుఁగాఁజేయు...॥(మను)

(6) ఋత్వసామ్యవళి:—వట్రువసుడిగలయొకహల్లు వట్రువసుడిగల యేయితరహల్లుతోనైన యతిగా నిల్పఁజెల్లును. ఉదా:—గీ॥ పృతనభవదసిననిఁ దెగి ♦ కృష్ణరాయ. (ఆముక్త)

(7) వృద్ధివళి:—సంస్కృతపదములతలకట్లపైఁగదియు పదాదివక్రములకు (ఎ-ఏలకు) సంధిలో వచ్చువక్రతమములకు (ఐ-ఔలకు)నుభయముఁజెల్లును. ఉదా:— A. ఉ॥... భో। గైకపరాయణుల్పురుషు♦లంగజుఁడప్రతిమానచేష్టిత...భా. వి.॥ B. శా॥ ...లో। కైకత్రాణుని రామునింగనుముని♦కీబుద్ధిగాకుండినన్ ॥ రా.

II వ్యంజనాక్షరయతులు:—

(8) ప్రాణివళి:—హల్లుతనకుఁదానేయతిస్థానమునసిలుచును.

☞ ప్రతిహల్లులోను నచ్చుభాగముకొంత హల్లుభాగముకొంత యుండును గాన యతిఁగూర్చునప్పుడు దానిలోనిహల్లునకు నచ్చునకుఁగూడ మైత్రి యుండునట్లు సదాగమనింపవలెను. కాని యీరెంటిలో నేదియోయొకటి మిత్రముగానుండినపనికిరాదు. ఏవిధమగుయతిఁగూర్చుచున్నను నీస్వరమైత్రి చెడకుండునట్లుచూడవలెను.

ఉదా:— మ॥ ననునువ్వొత్తుగఁ బాఱమీఁటితివినా♦నా ధైర్యసామగ్రి … … ॥ (వసు)

(9) వర్గయతి:— ప్రతివర్గమునఁగలవర్ణములు, నాయా వర్గముల యనునాసికముతప్పతక్కినవి, తమలోఁదాముయతులుగ నిల్వఁజెల్లును. ఉదా:— చ॥ బలితపుగుబ్బగుబ్బల ల పైనిరవ్రుంది మెఱుంగుదీఁగెచే ॥ (వసు)

(10) బిందుసంబంధవళి:— ప్రతివర్గమునను, ననునాసికాక్షరముగాక తక్కినవర్ణములు పూర్ణబిందుపూర్వములై తమయనునాసికముతో యతిఁగనిల్వఁజెల్లును.

ఉదా:—గీ॥మంజువాణీవిలాససం♦పదలసవియె॥ (వసు)

(11) తద్భవవ్యాజవళి:— జ్ఞవర్ణమునకు న- ణలుసంబంధించును. ఉదా:— సీ॥ నారాయణాంబకి♦జ్ఞానసారంబకి.

గమనింపు:— తద్భవవ్యాజమనగా సంజ్ఞ, యాజ్ఞ, విజ్ఞాపనము, విజ్ఞానము అనుసంస్కృతశబ్దములు తద్భవములైనప్పుడు వరుసగా సన్న, యాన, విన్నపము, విన్నాణము అని రూపములేర్పడును గనుక నీకారణమునవచ్చు జ్ఞవర్ణమునకు నవర్ణము సంబంధించునని తెలియవలెను.

(12) విశేషవళి:—క-ఖ-గ-ఘులు జ్ఞవర్ణముతో నన్యోన్యము యతిగానుండనొప్పును. ఉదా:— క॥ జ్ఞానికినుపదేశవిధిఁబ్ర♦కాశముసేయం ॥ (భా-శా)

(13) బిందుసంబంధివళి:— త-టవర్గ,లనునాసికములు

తక్క-తక్కినవి, పూర్ణబిందుపూర్వములైె యానోర్వ్యన్యముయతు ల నిలువవచ్చును. ఉదా:—శా॥ ... చం। దాలంబండునొక ప్పుడుందరుగ దిం*టంబాడియుం బంటయ్యె॥ (మను)

(14) అనునాసికవళి:— పూర్ణబిందు పూర్వములైన ట-ఠ-డ-ఢ-త-థ-ద-ధలు న-ణలకుం జెల్లును. ఉదా:—క॥ ... మహీమం।డలమెల్లను జూచినాఁడ*నాఁడునరేం।ద్రా॥ (రామా)

(15) ముఁవిభక్తియతి:— తత్సమపుంనపుంసకపదాంత మువర్ణములకు పు-ఫు-బు-భులు యతిగనిల్వఁజెల్లును. ఉదా:-క॥ ... । పుట్టిన సదసద్వివేక*ములుగల్గినదా॥ (భా-ఆ)

(16) మువర్ణవళి:— పు-ఫు బు-భులకు మువర్ణము యతిగనిల్వఁజెల్లును. ఉదా:— సీ॥గీ॥ పుష్పఫలపత్రజలమా త్ర*ములశరీర॥ (వసు)

(17) మవర్ణవళి:— బిందుపూర్వమైన య-ర-ల-వ-శ-ష-స-హలకు మకారము యతిగనుండవచ్చును. ఉదా:— చ॥..సం।హారణగుణాభిరాముఁడగు*మైలముభీమసఖడ్గసృష్టికిన్॥

(18) ఋజువళి:— హవర్ణముతో యవర్ణము సంబంధించును. ఉదా:— గీ॥ హంసవాహనజనక ద*యాసముద్ర॥

(19) భిన్నయతి:— గుడుసుపైనుండే క్రియమీఁదయా ముడివచ్చినచో ఇ-ఎ-హి-హేలుదానితో యతిగసంబంధించును. ఉదా:ఉ॥ఎట్టిప్రదోష వేళజని*యించినవాఁడ నృగాకచంద్రమా॥

(20) అభేదవర్గయతి: —A· "ప-ఫ బ-భ-వ"లకు యతి గూర్పనగు. ఉదా:— చ॥...సూనృతప్రవతియొక బావిమేలు మఱి*బావులు నూఱిటికింటె...(భా.ఆ).

B· ల-ళలకుయతిగూర్పనగును. ఉదా:—చ॥ లలిత

కృశోదరంబుతర♦ళత్రివళీ యుతరోమరాజియుర్ ॥భా.

(21) ల-డలకు యతి యుండవచ్చునని యప్పకవి చెప్పుచును దాహరణముగ "గానకళాలసత్కలాప♦డంబగోప ॥" యని తానేయిచ్చినాఁడు. మఱియు కవిజనాశ్రయమున ॥గీ॥ లలితవీణారవంబుతో♦షట్క సరియు, యనియుఁ గలదు. కాని పూర్వకవిప్రణీత కావ్యములనుండి యొకయుదాహరణమునైనం జూపియుండనందునను, నట్టిప్రయోగములెందును గానఁబడమిని, నిట్టియతిఁ గూర్పరాదని కొందఱు పెద్దలనుచున్నారు. కావున నిట్టి వివాదాంశములను సాధ్యమైనంతవరకుఁ గృతులఁ జొరనీకుండఁ జూచుటయే మంచిది.

(22) ర-లమైత్రి:—ఈమైత్రి చెల్లదు. చెల్లునని లక్షణసారమునం గలదు. కాని పూర్వకవిప్రయోగము లందుఁ జూపఁబడలేదు. సనాతనాంధ్రకవికృత భాగవతాది గ్రంథములయందును నీప్రయోగము కాన్పింపదు. మఱియు "రోలంబాలకరోమ్రుగ్రుంకి బిసవల్లీ♦ల్లునిర్మితూఁటాడి" యనియు, "గాయంచకార్ళ్లదో♦లకయమున్నె" యనియు రామరాజభూషణుఁడు వసుచరిత్రయందు వ్రాసినట్లు గొందఱు పఠించెదరు. కాని వానికి "లోలంబాలకరోమ్రుగ్రుంకిబిసవల్లీ♦ల్లునిర్మితూఁటాడి" యనియు, "కలహంసకార్ళ్యద♦పులకమున్నె" యనియు సరియగుపాఠములని పెద్దలు చెప్పుచున్నారు.

(23) ప-గలకు మైత్రి చెల్లదు. చెల్లుననియు "ఆ॥ గురునితంబ్రిలోక♦పాలుండుయాదవ॥" అని పూర్వకవిప్రయోగమున్నదనియుఁ గొందఱందురు కాని దానికిసరియగు పాఠము "మనునితంబ్రిలోక♦మాన్యుండ యాదవ॥" అని పూర్వము ముద్రింపఁబడినగ్రంథములఁ గన్పట్టెడిని.

(24) కాకుస్వరయతి:—ప్రశ్న, నిశ్చయ, సందేహార్థంబులందువచ్చు శబ్దాంత్యాక్షరమునకు (అనఁగాఁగాకుస్వరమందువచ్చినయక్షరమునకు) అ-య హాలు చెల్లును.

ఉదా:— గీ॥ ఈశ్వరేశ్వరుండ వీ♦వే రమేశ॥

(25) ఊష్మవిశ్రాంతి:— శ-ష స లన్యోన్యముయతులఁ నిల్వఁజెల్లును. ఉదా:—మ॥ స్తనయుగ్మంబతనుత్వమొందెనధరో♦ష్ఠంబిక్షుధర్మస్థితిన్॥ (వసుచ).

(26) సరసయతి:— శ-ష-సలు, చ-ఛ-జ-ఝలతోను; హ-యలు, అకారముతోను యతి సేయవచ్చును. ఉదా:—
1. ఉ॥ చెన్నుగనన్న దీపులి న♦సీసులదాగిలి మూతలాడుచున్॥వసు
2. ఉ॥ ఆనరలోకపాలకుమ♦హామహనీయభుజోపగూహన॥వసు.

(27) రేఫద్వయమైత్రి:—ఱ-రలకు మైత్రి చెల్లును.
ఉదా:—ఉ॥...పదా।ల్వన్నె పసింగి మేడలకు♦రాబనియేమి॥ విజ.

గమనింపుః— పింగళిసూరనాదిమహాకవులు ప్రయోగించినను, అప్పకవి మొదలగు కొందఱులాక్షణికులు రేఫద్వయమైత్రి చెల్లదని వాదించుచున్నారు. కాని ఆవిధముగా వాదించునప్పకవియే "సీ॥...అతిక్రూరసకలాతు♦రగములమీఁద" అనియును నింకననేకచోట్లను దద్భేదమునేగమనింపక ప్రయోగించినాఁడు. మఱియు, నాధునికకవులలోఁ బెక్కురీప్రయోగమును సమ్మతించుచుండుటచేతను, రచనాసౌలభ్యమున కొకింతసహకారియనియెంచియును, ర-ఱ లుచ్చరించునప్పుడు శ్రుతికి విశేషభేదము తోపకుండుటచేతను నీప్రయోగ మొప్పిదమనియే తెలిపితిని.

(28) సంయుక్తయతి:—ఒకటిగాని, అంతకన్న నెక్కుడుగాని, వత్తులుగలవర్ణమున్న యెడల నావర్ణముతో గాని, దానికిగలయేవత్తుతో గాని, యతిగూర్పవచ్చును. ఉదా:— చ॥...
యూర్జితరుచినింపఁగా నుదలఁ♦జెందినరాపిడి ... ॥వసు

(స్రగ్ధరాదివృత్తములలో మూఁడుచోట్లయతులు దగులునెడఁ బ్రథమమందు సంయుక్తాక్షరమున్నచో, దానికి రెండవచోట నేవర్ణము యతిగనిలుచునో, తక్కినచోట్లఁ దత్సంబంధవర్ణముంచవలెనే గాని, ప్రథమసంయుక్తవర్ణముం జూచినిలుపరాదు).

(29) అంత్యోష్మసంధివళి:— పొల్లులతో హావర్ణము కలిసిన నదికనుపడుచున్నను, లోపించినను నా హావర్ణముతో గాని వత్తుయొక్క సంబంధవర్ణముతో గాని యతిగూర్చవచ్చును
ఉదా:—సీ॥ హిమశైలసురసరి♦ద్ధీరవర్ణాకార.

(30) వికల్పసంధియతి:— పొల్లులు, హల్లులతో సంధి జేసినప్పుడు రెండురూపములు ప్రాప్తించినచో నారెండువిధములకుసంబంధవర్ణములు యతిగానిలువవచ్చును.

ఉదా:— సీ॥ తపనీయగోత్రభృన్మహితధర్మ.

"మయటనిత్యం" అనువచనప్రకారము మయపదమునిత్యసంధియగును కావున చిన్మయాదిశబ్దములకుమాత్రము మయపదమేనిత్యముగనుక మవర్గము, నవర్గముగాక, తవర్గమునకు యతిచెల్లదనియెఱుంగునది.

III ఉభయయతులు:—

(31) యుష్మదస్మచ్ఛబ్దవళి:— యుష్మదస్మచ్ఛబ్దములకు నచ్చుసంధించితే నేర్పడినవర్ణమున కుభయముం జెల్లును. (ఉభయమనగా నచ్చు, హల్లు ఈరెంటిలో దేనితోనైననుయతి యునికి వచ్చునని యర్థము). ఉదా:— క॥ ప్రస్తుతఫణిసత్రభయ| త్రస్తాత్ములమైనయస్మదాదుల కెల్లన్॥ (భారత-ఆది)

(32) పరరూపవళి:— *శకంధ్వాదిపదమధ్యసంధియుక్తవర్ణమున కచ్చునుహల్లునుజెల్లును. ఉదా:— ఉ॥ ...సా|రంగ వరేణ్యముల్పుఘుకిహాస్తములించుకసాచి ...॥ (చంద్రికా)

(*శకంధు-కర్కంధు-కుద్దాల,అలక్త-పర్కట-లాంగలీషా-హాలీషా-మనీషా-పతంజలిః-కుత్కుల-ఉష్ణీష-ముంజీర-మస్తిష్క-కులట-సారంగ-వేదండాదులు శకంధ్వాదులు)

(33) ప్రాదియతి:— ఉపసర్గలతో నదికినపుడుహల్లును, అచ్చునుజెల్లును. ఉదా:— అబ్జయోనిరజోగుణప్రాప్తిదనరు.

ఉపసర్గలు:— ప్ర-పర-అపి-సం-అను-సు-ప్రతి-నిర్-దుర్-అధి-వి-ఉప-అభి-ఉత్-అతి-ఆ-పరి-అవ-అప.

(34) నిత్యసమాసయతి:— నిత్యసమాసశబ్దములగు కర్ణాటాది పదమధ్యసంధియుక్తవర్ణమున కుభయముజెల్లును.

ఉదా:—ఉ॥...రామాయణము రచించినమ హాత్ములనాత్మ దలంచెదన్॥

కర్ణాట- వనాట- వనాళ-ద్వీప- అంతరీక్ష- నాస్తి- పదార్థ-అనేక అన్యోన్య- జనార్దన- నాక- విశ్వామిత్ర-అపోశన-స్వాంత-ఏకాంత - నారాయణ-వాతాయన-ఉపాయన- రసాయన-రామాయణ-మార్తాండ-ద్వారాదులు కర్ణాటాదులు.

భద్రాయిత, కుమారాయిత శబ్దములు క్యచ్ ప్రత్యయాంతములగుట సంయుక్తమిశ్రమములుగాని, నిత్యసమాసములు కావు. ఆ కారణముచే వీనికి వ్యంజనయతియే చెల్లును. ఉభయము చెల్లవు.

(32) దేశ్యనిత్యసమాసయతి:—దేశ్యనిత్యసమాసశబ్దములగు*రూపఱ మొదలగు పదమధ్యసంధియుక్తవర్ణమునకు నుభయముఁ జెల్లును.ఉదా:— చ॥గ్రక్కునఁ బ్రచ్ఛ అభవదీయరక్షణముననంద వెలుంగుచునుండునట్టి...॥(భార-అర)

*రూపఱ- పెంపఱ- పెల్లఱ-ఏపఱచుట-క్రిక్కిఱిసుట- క్రచ్చఱ -చుక్కఱ-చూపఱి-ఇత్యాదులు దేశ్యనిత్యసమాసపదములు.

(33) నిత్యయతులు:—"ఏని" అను శబ్దముతో నదికిన పూర్వపదముతుదియక్షరమున కుభయముఁ జెల్లును.

ఉదా:—క॥ పెట్టఁడు నారకమార్గం। బెట్టిమహాక్రూర కర్ముఁ డేనియుఁ దుద ని। ట్టట్టనక నెమ్మనంబున। నెట్టనహరిఁదల పఁగలిగ నేని మహాత్మా॥

(34) రాగమసంధియతి:— "ఆలు" అనుశబ్దమునొక్క మొదట "రా"గమమువచ్చిన యెడల నుభయముఁ జెల్లును. ఉదా:— ఉ॥...యే। కాంతమునందునున్న జవరాంద్ర నెపంబిడి పల్కరించులాగింతియెగాక॥ (మను)

(35) విభాగవళి:— పరిమాణార్థమగు "ఏసి" అను శబ్దము పూర్వశబ్దముతో సంధింప నుభయముఁ జెల్లును.

ఉదా:—ఋషులపాలిటి వేయింత • లేసి పనులు॥ (కాశీఖం).

(36) నామాఖండవళి:—అప్ప, అయ్య, అన్న, అరసు, అవ్వ, అమ్మ, అక్క, ఆయి ఈపదము లనుకుసంధులకు నుభయముఁ జెల్లును. ఉ॥...సాహిణిమా।రప్పను దానమున ఘనుఁ డు•రాజునటంచుఁ ॥

(37) పంచమీవిభక్తివిరామము:—కంటె,కన్న అనువిభక్తు లదికిసవర్ణములకు నుభయముఁ జెల్లును. ఉదా:—1 చ॥క్రతువునయాజకోత్తముల•కన్నఁ బ్రసిద్ధులు సర్వవిద్యలన్॥ భా-ఆ.

2 క॥...హైహయు।కన్నఁ దోర్వీర్యమెక్కు•డగు భార్గవు॥.

(38) ప్లుతవళి:—భీతి, శోక, తర్క, గీత, దూరాహ్వాన, సంశయార్థంబులఁబలుకునప్పటిప్లుతమునకునుభయముఁ జెల్లును.

ఉదా:— ఉ॥ ఎవ్విధిగాంతుఁ జెప్పగద•వే సెరువెద్ది శుభంబు నీకగున్॥ (శోకము-మనుచ).

(ఒకమాత్రకాలముహ్రస్వము; రెండుమాత్రలకాలముదీర్ఘము, మూఁడుమాత్రలకాలముప్లుతమనఁబడును. మాత్రయనగా నొకరెప్పపాటుకాలము.)

(39) ప్లుతయుగవిశ్రామము:— ప్లుతాక్షరములు వేరువేరు హల్లులైనను, స్వరమైత్రిఁగలిగినచో యతిగనిల్వఁ జెల్లును.

ఉదా:— ఉ॥... వేరొకవేల్పుగొల్వ, నీ వేగతి, కావవే,రఘుప•తీ! శరణాగతవజ్రపంజరా! ॥

(40) ప్రాసయతి:— ఒకపాదమునఁగల యతివర్ణద్వితీయాక్షరములు ప్రాసముగానుండఁ జెల్లెనేని, దానికిఁ బ్రాసయతియనఁబడును. ఈప్రాసయతి గీత, సీసములకును, లయవి

భాతి, లయవిహారి మొదలగు మాలికావృత్తములకును జెల్లును. తక్కినవానికిఁ జెల్లదు.

ఉదా:—గీ॥ దనుకడిందుపడదు♦మనసునాకు ॥రామా॥

☞ ప్రాసయతు లదుకునప్పుడు ప్రథమమునఁ బ్రాసపూర్వాక్షరము గురులఘువులం దేది యుండునో తర్వాతస్థానములయందును నదియేయుండవలయును.

(41) అఖండయతి:— ఒకహల్లు పాదాదినిగాని, విశ్రమస్థానమునఁ గానియుండి, రెండవచోట శబ్దాంత్యమునఁ గల అదేహల్లుతోఁ గూడిన తరువాతి యచ్చునకు యతిఁ గూర్పవచ్చునని కొందఱు లాక్షణికు లభిప్రాయపడుచున్నారు. దీనినే అఖండయతియందురు. కాని యిదేయుండవలెనని సిద్ధాంతీకరించినచో యతులకు నింతకుముందు నిర్ణయించిన కొన్ని కట్టుబాట్లకు భంగము సంభవించును. అదిగాక శ్రుతికటువుగఁ గూడ నుండునని తలంచెదను. మరియు యతిప్రాసనియమములు శ్రుతికి సుఖమునిచ్చుటకేర్పరుపఁ బడియున్నవి. కావున నీయఖండయతి మానుటయే యుక్తము.

భాస్కరరామాయణాది గ్రంథముల(" ఉ॥...రా॥వే।మన్నఁ గొరంత లేదు మణి♦మండన ముఖ్యములైన కానుకల్ "॥రామా॥) నక్కడక్కడ ప్రయోగములు కానవచ్చుచున్నవి. కాని యామహాకవులు ప్రమాదవశమున వానిని బల్కియుండవచ్చునని తలంచెదను.

పైనిచ్చిన "వే-మన్న" అనుదాని నుచ్చరించునప్పుడు "మ" అను అక్షరములోనున్న "అ" అను దానినే యూఁదిపలుకు చున్నాముగాని, మకారమును వత్తిపలుకుటలేదు. కావున నట్టియతియొప్పిదమున వలనుపడదు

యతిప్రాసనియమము లక్కర లేదను నీకాలమున నీతఁడు కొందఱుకవులు సమ్మతించినదానినిఁ గూడ నీవిధముగ వలదనుచున్నాఁడని నన్నుఁ గొందఱు పెద్దలు నిరసింతురని నాకుఁ దోఁచకపోలేదు. కానియీకట్టుబాటులు ప్రస్తుతకాలమునకే కావుగనుక నేనిట్లు చెప్పవలసివచ్చినది.

5వ ప్రకరణము.

# ప్రత్యయములు.

---

ఉక్త, అత్యుక్త, మధ్యమ, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి ఉష్ణిక్ అనుష్టుప్పు, బృహతి, పఙ్త్కి, త్రిష్టుప్పు, జగతి, అతిజగతి, శక్వరి, అతిశక్వరి, యష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సుకృతి, అభికృతి, ఉత్కృతి, ఇవి వరుసగా 1 మొదలు 26 ఛందములకుఁ, బేళ్ళు. ఈ యిరువదియాఱుఛందముల ౧౩౪౨౧౭౭౨౬ విధము లగుసమపాద వృత్తములు పుట్టినవి. వీని నెఱుంగుటకు వృత్తసంఖ్య, ప్రస్తార, లగక్రియ, అధ్వ, నష్ట, ఉద్దిష్టములని ప్రత్యయము లారువిధములుగలవు.

అందు (1) వృత్తసంఖ్య, 26 ఛందములఁబుట్టు వృత్తములను ప్రతిపాద క్లుప్తవర్ణములను నెఱింగించును. (2) ప్రస్తారంబు, తద్వృత్తగురు లఘుస్థానంబులఁ దెలుపును. (౩) లగక్రియ ప్రతిఛందోగ్రధితవృత్తంబుల భేదంబులఁ దెలుపును (4) అధ్వంబు, ప్రస్తారంబునకు సూచికయైయుండు. (5) నష్టంబువృత్తం బెన్నియవదని తెలిసినచోఁ దద్గురులఘుస్థితిం దెలుపును. (6) ఉద్దిష్టంబు వృత్తగురులఘువులఁదెలిపినచో నీఛందంబున నెన్నియవ వృత్తమని తెలుపును.

(౧) వృత్తసంఖ్య:— (1) ఏఛందమునఁబుట్టిన వృత్తపాదములకెన్ని యక్షరములుండును ?

ఎన్నవఛందమున నని యడుగుదురో యాఛందవృత్తముల కాఛందముయొక్క సంఖ్యయెంతో యన్నియక్షరములే యుండును.

ఉదా:— 1 వ ఛందవృత్తపాదమునకు 1 అక్షరము.
8 వ ఛందవృత్తపాదమునకు 8 అక్షరములు.
18 వ „ „ 18 „

(2) పైనఁదెల్పినప్రకారము ప్రథమఛందపాదవృత్తమున కొకయక్షరమేయుండవలయునుఁగదా! కావున నీప్రథమఛందమునఁగల వృత్తము లేకాక్షరగణములవలననే యేర్పడవలయును. ఏకాక్షరగణములు 2 మాత్రమే (గు ◡, ల । ). ఈరెండుగణములచేత నేర్పడఁగలవృత్తములు రెండేయగు

ను. అనగా గురువుచేతనొకటి, లఘువుచేతనొకటి. కావునఁ బ్రథమఛంద
మున రెండువృత్తములే పుట్టినవి.

ఇట్లే ద్వితీయఛందమున ద్వ్యక్షరగణములవలననే వృత్తములేర్పడ
వలసియున్నవి. ఈ ద్వ్యక్షరగణములు నాలుగు. కావున నానాల్గువిధ
ములగు గణములచేత 4 వృత్తములే పుట్టినవి.

పైప్రథమ, ద్వితీయఛందవృత్తములేర్పడిన విధముంబట్టిచూడగాఁ బ్రథ
మఛందమున నెన్నివృత్తములు పుట్టెనో ద్వితీయఛందమునవానికి రెట్టింపుపు
ట్టినవికదా. ఇదేప్రకారము చూచిన ద్వితీయఛందమునకు ద్విగుణితముగఁ
దృతీయఛందమునను దృతీయఛందమునకు ద్విగుణితముగఁ జతుర్థమునను,
నటుపైనిట్లేయొక్కొక ఛందమునఁ బుట్టినవృత్తసంఖ్యకు నినుమడిగ దానిత
ర్వాతి ఛందమున వృత్తములు బుట్టుచున్నవని తెలిసికొనుము.

ఉదా:— 4 వ ఛందమున ( 8 × 2=) 16 వృత్తములు.
5 వ ,, ( 16 × 2=) 32 ,,
6 వ ,, ( 32 × 2)= 64 ,,

గమనింపు:— మరియొకవిధము:— అడిగినవృత్తసంఖ్యయెంతో అన్ని
పర్యాయములు ప్రథమఛందపు వృత్తసంఖ్యయగు 2 ను 2 తో హెచ్చ
వేయుచువచ్చిన మొత్త మాయడిగిన వృత్తసంఖ్యయగును.

(౨) ప్రస్తారము:— ఆపుట్టినవృత్తములలో నేయేవృత్తమున కేయేగ
ణములుండును? అనగా గురులఘువు లేవరుసనుండును ?

(a) ఎన్నవఛందములోని వృత్తములనడుగుదురో దానికిఁ బై 2 లో
చెప్పినప్రకారమెన్ని వృత్తములు పుట్టునో మొదట తెలిసికొనుము.

ఉదా:— 4 వ ఛందమునకు 16 వృత్తములు.

(b) కావున, మొదటగురువు దానిక్రింద లఘువు నీప్రకారమొకదాని

క్రింద నొకటి 16 వరకు వ్రాయుము. ఉదా:— 4 వ ఛందమునకు 4 చాళ్ళు

(c) తరువాత, నాచాలునకుఁ గుడిప్రక్కన మొదట 2 గురువులు దానిక్రింద 2 లఘువులు చొప్పున నా 16 వరకు వ్రాయుము. అనగా మొదటి చాలులో వ్రాసిన సంఖ్య మేరకు రెట్టింపు చొప్పున రెండవచాలున వ్రాయవలెను

(d) ఇదేవిధముగ నది యెన్నవ ఛందమో అన్ని (1 లోచూడుము) చాళ్ళు అగువరకు నదేవిధమున గురులఘువులసంఖ్య రెట్టించుచు వ్రాయవలెను. అనగా 3 వ చాలునకు 4 గురువులు 4 లఘువులు, 4 వ చాలునకు 8 గురువులు 8 లఘువులు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | U | U | U | U |
| 2 | \| | U | U | U |
| 3 | U | \| | U | U |
| 4 | \| | \| | U | U |
| 5 | U | U | \| | U |
| 6 | \| | U | \| | U |
| 7 | U | \| | \| | U |
| 8 | \| | \| | \| | U |
| 9 | U | U | U | \| |
| 10 | \| | U | U | \| |
| 11 | U | \| | U | \| |
| 12 | \| | \| | U | \| |
| 13 | U | U | \| | \| |
| 14 | \| | U | \| | \| |
| 15 | U | \| | \| | \| |
| 16 | \| | \| | \| | \| |

ఈవిధముగా వ్రాయగా నేర్పడిన చాళ్ళలో నెడమనుండి కుడికివరుసగానుండిన గురులఘువులవరుసయే యానాల్గవఛందములోని 16 వృత్తములకుఁగల యొకపాదముయొక్క గురులఘువులవరుస (గణములవరుస) యని యెఱుంగునది. ఇవిసమపాదవృత్తములగనుక తక్కిన 3 పాదములకు నాగణములేయని గ్రహించునది.

(3) నష్టక్రమము:— ఇన్నవఛందమున, నిన్నవవృత్తమునకు, గణము (గురులఘువు) లెవ్వియనియడిగినఁ జెప్పెడివిధము.

(a) ఎన్నవ వృత్తమడుగునో దానియొక్క సంఖ్యను మొదట వ్రాయుము.

తరువాత దానిని అర్ధించుము. (అర్ధించబోవునది సరియంకెయైనచో లఘువునుంచవలెను). ఆ అర్ధించగావచ్చిన దానిని తిరిగి యర్ధించుము. (అర్ధించబోవునది బేసిసంఖ్యయైనచో దానికి 1 కలిపి తరువాత దానిని అర్ధించుము. (అలాగు 1 టిని కలిపినప్పుడెల్ల గురువును నిల్పవలెను.)

ఉదా:— 4 వ ఛందమున 12 వ వృత్తమునకు గణములెవ్వి? వృత్తసంఖ్య 12 కావున

12ను అర్ధించితే 6... ।
6 ,, 3... ।
3 + 1 ,, 2... U
2 ,, 1... ।

ఉత్తరువు:— । । U ।

ఈవిధముగా నదియెన్నవఛందమో అన్ని స్థానములేర్పడువరకు నర్ధించవలెను. అలాగునర్ధించునప్పుడు 1 మిగిలినప్పుడుగాని, యితర బేసిసంఖ్యవచ్చినప్పుడుగాని 1ని కలిపి అర్ధించవలెను. 1 యే మిగిలి యింకఁగొన్ని స్థానములు పూర్తిగావలసినప్పుడు 1 ని మనముకోరినన్ని స్థానము లేర్పడువరకు, కలుపుచు నర్ధించుచు బోవలయును.

(४) ఉద్దిష్టము:— ఒకవృత్తపాదమునిచ్చి, యిది యేఛందముయొక్క యెన్నవవృత్తమని యడిగినప్పుడు చెప్పెడివిధము.

(a) మొదట, నీవృత్తమెన్నవఛందములోనిదని తెలిసికొనుట సులభము. ఎట్లనగా నాపాదమునకెన్ని యక్షరములున్నవో అది అన్నవఛందములోనిదని పైనఁజెప్పియున్నాము. (పైన ౧ లోఁజూడుడు).

ఉదా:—“వసుదేవసుతుꣳ”॥.

ఈవృత్తపాదమున 6 వర్ణములున్నవి. కాబట్టి యీవృత్తము 6 వ ఛందములోనిది.

(b) ఈవృత్త మాఛందమున నెన్నవ వృత్తమో యింకఁదెలిసికొనవలయును. అందుకు, ఇచ్చిన వృత్తపాదము నొకచో వ్రాసి, దానిక్రిందఁగ్రమముగ గురులఘువులసంజ్ఞల నాయాయక్షరములనుబట్టి వానిక్రింద వ్రాయుము. అంతట వానిక్రింద నెడమనుండి కుడివైపునకు నేకాదిద్విగుణితముగ (అనగా మొదటియక్షరముక్రింద 1; రెండవయక్షరముక్రింద మొదటిదానికి రెట్టింపు అనగా 2; 3 వ యక్షరముక్రింద రెండవదానికి రెట్టింపు అనగా 4; ఈవిధముగా రెట్టించుచు) అంకెలను వ్రాయుము. అంతట నావ్రాసిన వానిలోని లఘువులక్రింది యంకెలనుమాత్రము కూడి ఆ మొత్తమునకు 1టికి

లిపి చేరవచ్చిన మొత్తపుసంఖ్యయే అడిగిన వృత్తసంఖ్యయని తెలియును.

ఉదా:—వ సు దే వ సు తుణ్—ఇచ్చిన వృత్తపాదము
।  ।  ‿  ।  ।  ‿—గురులఘువులు
౧  ౨  ౪  ౮  ౧౬  ౩౨—ఏకాది ద్విగుణితము
౧+౨+౮+౧౬=౨౭—లఘువులక్రింది సంఖ్యల మొత్తము
౧—కలుపు

మొత్తము...౨౮—ఇదియే వృత్తసంఖ్య.

గమనింపు:— ఇచ్చినవృత్తపాదమున నన్నియు గురువులైనచో నది ప్రథమవృత్తమనియు, నన్నియు లఘువులైనచో నది చివరవృత్తమనియు నెఱుంగుము.

---

6వ ప్రకరణము.

# వృత్తములు.

---

పాదనియమముగలిగిన పద్యములన్నియు వృత్తములనియు, జాతులనియు ద్వివిధము. నిసర్గగణములచేత వృత్తములును, ఉపగణములచేత జాతులు నేర్పడును. ఇందువృత్తములకు యతులుమాత్రము చెల్లును. ప్రాసయతులు చెల్లవు. ఇవి సమపాదవృత్తములుగాన నొకపాదమునకుఁ జెప్పినలక్షణమే తక్కిన 3 పాదములకును నెఱుఁగవలెను. గ్రంథవిస్తరభీతిచేఁ, బూర్వకవులు ముఖ్యముగా వ్రాసియుండిన వృత్తములఁగొన్నింటిమాత్రమేయిటఁ బేర్కొంటిని. ఇవిగాక విశేషముగఁ దెలిసి

9 వ ప్ర క ర ణ ము.

# ఉపజాతులు

ఉపజాతుల లక్షణము:— ప్రథమపాదమున గురువున్నం దక్కిన పాదములఁగూడ గురువేయుండవలె ననువిధిలేదు. వీనికి యతులుగాని, ప్రాసయతులుగాని వాడవచ్చును.

(1) తేటగీతి:— ఇదిసమపాదములుగలది. ప్రతిపాద మునకు వరుసగా నొకసూర్యగణము, 2 ఇంద్రగణములు, తరు వాత 2 సూర్యగణములు గలిగి, నాల్గవగణాదిని యతిదాకును.

ఉదా:— తే॥గీ॥ ఇనుఁ డొకం డింద్రు లిద్దరు ♦ నినులిరువురు
వరుసగాఁగూర్చి, యతి నాల్గ♦వ గణమునకు
నమరఁ దేటగీతిచరణ♦మై తనర్చు
పుండరీకాక్ష! దానవ ♦ శౌండశిక్ష॥

(2) ఆటవెలఁది:— దీనికిఁ గందమునకువలె 1, 3 పాద ములకును, 2, 4 పాదములకును లక్షణము నొకటిగనుండును. మొదటిపాదమునకు వరుసగా 3 సూర్యగణములును పైన 2 ఇంద్రగణములును, 2 వ పాదమునకు 5 సూర్యగణములును గలిగి ప్రతిపాదమునకు 4 వ గణాదిని యతిదాకును.

ఉదా:— ఆ॥వె॥ ఇనులుమువ్వు రింద్రు♦లిద్దరు నొకపాద
మందు; నొకట సూర్యు♦లైదుగురును
గూర్పఁగా సగంబు♦కొనమరారు; రెట్టించి
నంతబూర్ణమగును ♦ నాటవెలఁది॥

(3) సీసము:— వరుసగా 6 ఇంద్రగణములపై 2 సూర్య గణములుగలిగి, ప్రథమతృతీయ గణములకును, పంచమసప్తమ

గణములకును, వేరువేరుగ యతులనదికినట్టి 4 పాదములను గూర్చి, తుదిని తేటగీతిగాని, ఆటవెలఁదిగాని చేర్పవలయును.

ఉదా:—సీ॥ దివి జేశులార్వ్వురు ♦ దిననాథులిర్వ్వురు
క్రమమునఁ బ్రతిచర♦ణముననుండి;
యాదిమ గణమున♦ కరయఁద్వితీయగ
ణమునకు, నంత బం♦చమగణమున
కేడవగణమున♦ కేర్పడ వేర్వేర
యతి, ప్రాసయతుల నె♦య్యదియునైనఁ
గదియుపాదంబులు♦ కరిరిపు! నాలుగు
గూర్పంగవలయును♦ నేర్పుపిదప
నాటవెలఁదియైనఁ♦ దేటగీతియునైన
వానితుదిని సమా♦కవలయు సీస
మనఁగ నదియొప్పు♦ నంబుజదళనేత్ర!
మారజనక! శ్రీర♦మాకళత్ర! ॥

గమనింపు:—సీసపాదములు (నెద్దవి) మాలికగఁ గొన్నిటిఁగూర్చి, తుదిని గీతిపద్యమును జేర్చిన సీసమాలిక యందురు. ఇట్లే చంపకమాలాది వృత్తపాదములనుగూడఁ గొన్నిటిఁగూర్చి, మాలిక యని పేరిడవచ్చును. తేటగీతిపాదముల మాలికగా వ్రాయుటాచారము సనాతనాంధ్రగ్రంథములఁ గనఁబడ్డదు. కాని యాధునికకవులు విరివిగవాడుచున్నారు.

10వ ప్రకరణము.

# గద్యము.

గద్యమన వచనమనఁబడును. వచనమునకుఁ దోచినరీతినిఁ బదములు వ్రాసి ముగించినఁజాలును. దీనియందు యతిప్రాసాది నియతిలేదు. కావున నుదాహరణమును జూప మానితిని. మనుచరిత్రాది గ్రంథములందుఁ జూడనగును.

# ప్రబంధరచన

ప్రబంధమును రచించుటకుఁ బ్రారంభించునపుడు ప్రబంధనామమునకును, ప్రబంధపతినామమునకును మొదలనుండు వర్ణములవలన వధూవరులకుఁ జూచెడురీతిని సకలకూటములును జూచి తారాబలచంద్రబలసంపత్తిగలిగి, వివాహప్రశస్తలగ్నమునందుఁ గృతిరచనకు నాందిపద్యముఁ గూర్పవలయును. అట్లుగాను, ప్రబంధమారంభ ప్రయోగమగు శుభాశుభ ఫలముల నెఱిఁగి రచింపవలయును.

మహాప్రబంధమనియుఁ, జాటుప్రబంధమనియుఁ బ్రబంధములు రెండువిధములు.

(1) మహాప్రబంధము:—— దీనికిఁ బుర, ఋతు, ప్రయాణ, వనవిహార, వారికేళి, కన్యాంగసౌందర్యకథన, చంద్రోదయ, విప్రలంబ, ద్యూత, అబ్ధితరణ, సురాపానజ వికార, సూర్యోదయ, వివాహ, గృహప్రవేశ, పుత్రోదయ, సాగర, శైల, మృగయా, వన, అరణ్య, మంత్ర, విజయ, మున్యాశ్రమ, దండయాత్ర, జారసంవాద, దశావతార, నాయక గుణవర్ణనము లనునిరువదియేనువర్ణనములలో నవశ్యమైన, నెక్కుడుభాగమైనఁ జేర్చి, ఆశ్వాసములుగ నేర్పఱిచి, కథావతారమును, షష్ఠ్యంతములును వ్రాసి, ఆశ్వాసాదియం దొకకందమును, నాశ్వాసాంతమునఁ జంపకమాలాది మొదటినాల్గు వృత్తములలో నొకటియుఁ గందమొకటియు, నితరవృత్తములలో నొకటియుఁగా మూఁడు చమత్కృతులతో లిఖియించి, గద్యము రచింపవలసినది.

(2) చాటుప్రబంధములు:—ఇవి సంఖ్యాబద్ధములనియు, సంఖ్యారహితములనియు ద్వివిధము.

(a) సంఖ్యాబద్ధములు.

| సంఖ్య. | నామము. | సంఖ్య. | నామము. |
|---|---|---|---|
| 1 | ముక్తకము | 12 | భాస్కరమాల |
| 3 | లోక్యము | 16 | శశికళ |
| 4 | వారిధిమాల | 27 | తారావళి, నక్షత్రమాల |
| 5 | పంచరత్నములు | 32 | రాగమాల |
| 8 | వారణమాల | 64 | విద్యామాల |
| 9 | నవరత్నమాల | 96 | తత్త్వమాల |
| 10 | అవతారమాల | 100 | శతకము. |

పైనఁజెప్పిన పద్యసంఖ్య నొకటేవిధమగు పద్యములతో నొనర్పవలయును మకుటమే కడ వెళ్ళఁ బ్రతిపద్యమునకును గూర్చి పేరిడవలయును.

(b) సంఖ్యారహితములు:— రగడ, ద్విపద, దండకములు వలయునన్ని పదములఁ గూర్చి చెప్పవచ్చును.

ఒకరగడ 4 చరణములును, ఒకవృత్తము 4 చరణములు నుగలిపి యేకసమాసముగాఁజెప్పినచోఁ గలికోత్కళిక యనఁబడును. తెనుఁగుభాషయందు లేనట్టియు, నాంధ్రదేశమునవిరివిగ వాడుకలోనుండినట్టియు అన్యదేశభాషలలోని కొన్ని పదముల సందర్భానుకూలముగఁ దెనుఁగుకవిత్వమునఁ గూర్చి చెప్పనగు.

అలంకారములు, శుభాశుభ గణ, వర్ణములు, బంధకవిత్వవిషయము, వ్యాకరణాంశములు, మొదలగునవి చేర్చి ద్వితీయభాగముగఁ బ్రచురింపఁబడును.

సంపూర్ణము.

---




1 వ పటము.

సూక్ష్మదర్శకముద్వారా నీటిబొట్టు.

1,2,3,4, సూక్ష్మజీవులు.

1. చుక్కలవలెనున్నవి.
2. జంటచుక్కలుగనున్నవి.
3. కణికలవలె ఉన్నవి.
4. మెలితిరిగియున్నవి.
5. శాకపదార్థము క్రుళ్లుచున్నది.
6. ఒక పురుగుగ్రుడ్డు.

7. } మిక్కిలిసూక్ష్మమైన పాము
9. } వంటిపురుగు.

8 దారపోగు.

10. కణికలవంటిసూక్ష్మజీవులవృద్ధిని చూపు గొలుసులు.

11. } చుక్కలవలె నుండు సూక్ష్మ
12. } జీవుల గొలుసులు.

13. ఒక నీటిపురుగు.

1,2,3,4, పటములు విజ్ఞానసర్వస్వము(The Telugu Encyclopedia)నుండి తీసికొనబడినవి.




2-వ పటము.

ఆవు పేడ కలిసిన పాలబొట్టు.

1. బూజుపోగులు.
2. చుక్కలవలెనుండు సూక్ష్మజీవులు.
3. సూక్ష్మజీవుల గొలుసు.
4. కణికవలెనుండు సూక్ష్మజీవి.
5. పురుగుల కళేబరములు.
6. పశువునుండి [illegible]

# Cholera

(Its causes, effects, prevention & cure)

BY

Dr. A. LAKSHMI PATHI, B.A. M.B. & C.M.

EDITOR, NATURAL SCIENCE SECTION,
THE TELUGU ENCYCLOPEDIA
AUTHOR OF 'BIOLOGY'
AND 'MALARIA'

THIRD EDITION

Madras
THE VIJNANA CHANDRIKA MANDALI
1914

విజ్ఞానచంద్రికాగ్రంథమాల. 10

# కలరా

అది వ్యాపించువిధము ; దాని నడ్డగించు మార్గములు; చికిత్స

ఇది

'జీవశాస్త్రము' 'చలిజ్వరము' అను గ్రంథములకర్తలును
ఆంధ్రవిజ్ఞానసర్వస్వపు ప్రకృతిశాస్త్రభాగపు సంపాదకులును
అగు

ఆచంట - లక్ష్మీపతి, బి.ఏ., ఎం.బి., సి.ఎం., గారిచే

రచియింపఁబడియె

మూడవకూర్పు - ఆరవవేయి

చెన్నపట్టణము
వాణీనిలయముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె

1914

పోస్టేజి వేరు] [వెల 0 - 6 - 0

# పీ ఠి క

1908 స॥ ఆగస్టు నెలలో నేను చెన్నపట్టణమున వైద్య శాస్త్రము చదువు దినములలో మునగాల పరగణా జమీం దారు లగు శ్రీరాజా నాయని వేంకట రంగారావు బహద్దరు వారు తమ పరగణాలో కలరా వ్యాపించియున్నదనియు దాని నివారణ నిమిత్తమేయేజాగ్రతలు పుచ్చుకొనవలెనో తెలియ పరుపు మనియు, తగినమందులను పంపుచు వానిని ఉపయో గించు విధములను తెలుపు మనియు కోరుచు నొక యుత్తర మును వ్రాసియుండిరి.

ఆ సమయముననే తెనుగు జిల్లాలలో ననేక భాగముల యందు ఈవ్యాధి ప్రబలియున్నందున, అదేవిధముగ జాబులు వచ్చుచుండెను. వారల కందరకు వేరువేరుగ జవాబులు వ్రాయుటకంటె ఈవిషయమునుగూర్చి చిన్నచిన్న వ్యాసము లనువ్రాసి, ఏదయినొక పత్రికమూలమున ప్రకటించుటవలన నందరకును నుపయోగపడు నని తలచితిని. అట్లు 15 దినముల కొకవ్యాసము చొప్పునవ్రాసి "ఆంధ్రదేశరంజని" అను పత్రికకు పంపుచుంటిని. కాని నాలుగువ్యాసములను వ్రాయువరకు నా పరీక్ష సమీపించినందున అప్పటికి విషయమును ముగించుటకు తగు సావకాశము లేకపోయినది. నాకు గల విశ్రాంతికాలము మిక్కిలి కొద్దియయినను విజ్ఞాన చంద్రికా మండలివారి యొత్తుడు

నామాంతర ములు.

కలరాకు విషూచి, వాంతిభేది, గోట్టాలమ్మ, తుడుపులమ్మ, మొదలగు అనేక నామాంతరములుగలవు. ఇందు కడపటిమూడు పేర్లును దాని ముఖ్యమైనగుణములనుబట్టి పుట్టినవి. మన దేశమునందలి ప్రజలు తమకు తెలియని విషయముల గూర్చి విశేషముగా నాలోచనలు, వాదములను పెట్టుకొనక వాని కన్నిటికి కారణ మేయక్షిణియో, ఏదో యొక దయ్యమో లేక దేవరయో అని చెప్పుకొనుట సాధారణప్రసంగమే కదా; అట్లే గొట్టము వెంబడిని కొట్టినట్లుగు విరేచనములకు కారణమేమనిన సులభముగ చెప్పదగిన జవాబు "గోట్టాలమ్మ" యనియు గ్రామములోని ప్రజల ననేకులను ఒక్కసారిగా తుడిచిపెట్టుశక్తి యేదన "తుడుపులమ్మ" యనియు చెప్పవచ్చును గదా? ఈవ్యాధిని గూర్చి తమకు గల భయము చొప్పున దానినుండి తప్పించికొనుటకు వేరుమార్గము తెలియనప్పుడు హిందువులు దేవతలను, అమ్మవార్లను, తురకలు పీర్లను, క్రైస్తవులు మేరీయమ్మలను పూజించుచు ఉత్సవములు జరుపుకొనుచుందురు. ఇది యెవరైనకాదనిన 'ఒరే వీడు నాస్తికుడురా. వీనికి దేవుడు లేడు, గురువు లేడురా. వీనిని వెలివెయ్య వలసినదిరా' అందురు.

ఇది ఇట్లుండనిచ్చి కలరాయొక్క నిజచరిత్రను తెలిసికొనిన వారికి తమ మూఢత్వములు పోయి దాని దండయాత్రల నుండి తప్పించు కొనుటకు కొంత వరకు సాధ్యమగు నని తలచి ఈ చిన్నపుస్తకమును వ్రాయ బూనితిమి. చిరకాలము నుండి బంగాళా దేశము కలరాకు పుట్టినిల్లని చరిత్రవలన కానవచ్చు చున్నది. అక్కడనుండి అప్పటప్పట హిందూదేశ మంతటను అదివ్యాపించు చుండెను. వ్యాపక ప్రదేశములు.

1817 వ సంవత్సరమునందు ఈవ్యాధి ఆశియా ఖండమంతటను ఒక్కరీతిగా వ్యాపించి, తూర్పున జపాను వరకును, దక్షిణమున మారీషస్ లంకవరకును, పశ్చిమమున కాస్పియన్ సముద్రమువరకును ఆవరించెను. కాని 1830 వ సంవత్సరము వరకును ఐరోపాఖండమును ఈవ్యాధి ముట్టి యుండలేదు. ఆ సంవత్సరములో ఆఫ్గనిస్థానము పరిషియాల మీదుగా రషియాకు బోయి అక్కడ నుండి ఐరోపాదేశమంతయు తుడిచిపెట్టె. 1832 వ సంవత్సరముననే వేసవి కాలములో అట్లాంటిక్ మహాసముద్రమునుకూడ దాటి కనడ, యూనయిటెడ్డుస్టేట్సు దేశములకు జేరెను. ఈ దండయాత్ర

1889 వ సంవత్సరము వరకు నిలువ లేదు కాని యిటుతరువాత ఐరోపా దేశమునకు ఈ వ్యాధి లెక్కకు నాలుగైదుసారులుమాత్రమువ్యాపించెను.

ఇట్లు ప్రపంచమునందలి ఇతర దేశములయందు కలరా ఎప్పుడెప్పుడు వ్యాపించుచుండునో లెక్క వేయుటను మిక్కిలి సులభముగా తెలిసినను, మన దురదృష్టమేమోకాని మనదేశమునం దాతుమపు లమ్మయొక్క ఘోరకృత్యములను లెక్కింప నలవి గాదు. ఆప్పు డిప్పుడనక ఏకాలమునందు జూచి నను ఎక్కడనో ఒకచోట ఇండియాదేశమునం దీవ్యాధి నివసించుచుండెను గాని ఒక దినమైనను ఈదేశమును విడిచియున్నదని చెప్పవలను పడదు.

మనిషి మోసి కొనిపోవుట.

కలరాను ఒక స్థలమునుండి మరియొక స్థలము నకు మనిషి మోసికొని పోవును. ఏలయన అది వ్యాపించు మార్గములను గాలించి వెతుకగా, మానవసంఘముల రాకపోకల కుపయోగపడు గొప్పగొప్ప రస్తాలదారినే అదియు వ్యాపించు టయు, అట్టి రాక పోకలచే సంబంధము గలిగి యుండని కొన్ని మారుమూలప్రదేశములను అది యెన్నడును త్రొక్కిచూడ కుండుటయు పరిశీలింప, అది ముఖ్యముగా మానవుని చేతనే గొనిపో బడు

చున్నదని తెలియగలము. ఇందుకు నిదర్శనముగా ఐరోపా మొదలగు ఖండముల యందు వర్తక వ్యాపారముల కొరకు వచ్చెడి జన సమూహముల రాక పోకల సందడిగల సముద్రతీరపు పట్టణముల యందు మాత్రమే ఇది ప్రారంభించు చుండుట చూడగలము. పిమ్మట ఇది క్రమక్రమముగా మెట్ట దారిని లోపలకు వ్యాపించును. ఇండియాదేశము నందు ఈవ్యాధి మితిలేక వ్యాపించి యుండుటచే దానిమార్గముల కనిపెట్టుట మిక్కిలి కష్టమైనను జనుల రాకపోకలచేతనే ఇది వ్యాపించు నని తెలిసి కొనుటకు కొన్ని నిదర్శనములను చూపెదము.

ఈ దేశమునందు అక్కడక్కడ గల పుణ్య క్షేత్రములు ఈవ్యాధిని వెదజల్లు విత్తనపుగింజలు. యాత్రాపరులు తమతో నాగింజలనుండి కలరా విత్తనముల నెత్తికొని పోవుదురు. హరిద్వారము కాశీ, మొదలగు చోట్ల లక్షలకొలది క్రొత్తజనము దిన దినమును వచ్చుచు బోవుచుందురు గదా! ఇందుచే ఈస్థలములయం దెల్లప్పుడు కలరా విను వక యుండునని చెప్పవచ్చును. గోదావరిపుష్కరస్నాన పుణ్యముతోపాటు ఆ ప్రాంతముల వారికి

పుణ్యక్షేత్రములు; విత్తనపుగింజలు.

కలరా విత్తనములుగూడ లభించుచుండుట మన మందర మెరిగినదియే. యాత్రాపరులలో నొకరు మూట కట్టుకొనివచ్చిన వ్యాధిని భక్తు లందరును సంగ్రహించుకొని వారివారి ఇండ్లకు బోవునపుడు తాము పోవు మార్గముల యందు కొంచెము కొంచెము పంచి పెట్టుకొనుచు తుదకింటికి గూడ చేర్చెదరు.

రైలుయొక్క వేగముతో పరుగెత్తును.

కలరా సాధారణముగా మనిషికంటె వేగముగ పోజాలదు. కాని ఇప్పుడు మన దేశమునకు లభించిన నాగరికత్వముచేత మనము సంపాదించుకొనిన వాయువేగముగల రయిలుబండ్లు మొదలగు వాని సహాయములచే గలిగిన రాకపోకల సౌలభ్యమునుబట్టి, మన తండ్రితాతల కాలమునకంటె మన కాలమునందు కలరావ్యాధి మిక్కిలి వేగముగ ఒకచోటినుండి మరియొక చోటికి పరుగెత్తుకొని పోవు చున్నది. కాశిలో పుట్టిన మరునాటికే అయిదారు వందల మయిళ్ల దూరమునందు గల చోట్లకు గూడ కొంతవరకు రయిలు మీదను, పొగోడపడవల మీదను, తుదకు బండ్లమీదను, ప్రయాణము చేసిచేసి, అతి గూఢ ప్రదేశములకు

సయితము ప్రయాణీకుడు దీనిని ఇప్పుడు కొనిపోవు చున్నాడు.

ఇతర దేశములతో సంబంధములేని ప్రదేశ ములయందు ఈ వ్యాధి వ్యాపింప నేరదని దృఢ ముగా జెప్పుటకు నిదర్శనమేమనగా: కలరాయొక్క పుట్టినింటికి మిక్కిలి సమీపమున నున్నను, అండమాను దీవుల నిది యెన్నడును త్రొక్కిచూడలేదు. ఏలయన అక్కడికిపోవు ప్రయాణీకుల నెవ్వరిని పరీక్షమీదగాని విడువరు. ఈ ప్రయాణీకు లీవిత్తన ములను కొనిపోకుండ డాక్టరులు కావలియుందురు. ఇట్లే పసిఫిక్ మహాసముద్ర మధ్యమున నుండు అనేక లంకల యందును, ఆస్ట్రేలియా, న్యూజీలెండు మొదలగు దేశములయందును ఈ వ్యాధి ఎప్పుడును వ్యాపించి యుండలేదు.

డాక్టర్లు కావలియుందురు.

ఎల్లప్పుడు కలరా వ్యాపించియుండెడు బంగాళా మొదలగు దేశముల యందు సైతము ఈ వ్యాధి అన్ని ప్రదేశములయందును సమముగా వ్యాపించి యుండదు. ఇంతేగాక అన్ని ఋతువులయందును సమముగ నుండదు. అన్ని సంవత్సరములందును తప్పక ఉండుననని చెప్పుటకు వీలులేదు. ఇట్టి

దేశకాలపాత్రములు.

ప్రదేశము లందుగూడ ఎన్నఁడును కలరాను ఎరుగని భాగములు కొన్నిగలవు. కొన్నికొన్ని సంవత్సరముల యందును, కొన్ని మాసముల యందును దాని యుద్రేకము హెచ్చుచుండును. ఒక ప్రదేశమునందు దాని అభివృద్ధికి తగిన కాలము మఱియొక ప్రదేశమునందు ఆవ్యాధియొక్క నశింపునకు తగిన తరుణమై యుండును. ఏకకాలమునం దన్ని ప్రదేశములందు వ్యాపించు నను నియమము లేదు. ఒక రస్తామీఁదనేయుండు కొన్నికొన్ని గ్రామముల నది మధ్యమధ్యవిడిచి పైనుండు గ్రామములను ముట్టడించుట కలదు. ఒక పట్టణమునందే కొన్ని వీధులను తీవ్రముగ తుడుచుచు మరికొన్ని వీధులను ముట్టకయే యుండవచ్చును.

జనసమ్మర్దము అపరిశుభ్రత స్నేహితులు.

మొత్తముమీఁద చూడగా పల్లపు ప్రదేశములును, ముఖ్యముగా నదులుకాలువలు గలచోట్లు ఈ వ్యాధియొక్క వ్యాపనమునకు తగినవిగా తెలియవచ్చుచున్నది. ఉన్నత ప్రదేశములును, మెరక భూములును దీనివృద్ధికంతగా తగినవికావు. జనసమ్మర్దము, అపరిశుభ్రత, చెడ్డనీరు యివియన్నియు ఈవ్యాధికి స్నేహితులు. అయినను కలరాయొక్క వ్యాపకమునకు ముఖ్యాధారమైన వాహనమునిశ్చయముగా మన

ముపయోగించెదు నీరు అని ఇప్పుడు స్థిరపడినట్లు క్రింద చదువగలరు.

కలరా మనసోటిమార్గమున ప్రవేశించును. ఆహారమును, త్రాగెడునీరును కలరావ్యాధికి వాహనములు.

మనముత్రాగెడు నీరు

అప్పటప్పట ఈవ్యాధియొక్క కారణములను గురించియు, స్వభావమును గూర్చియు అనేక సిద్ధాంతములు పుట్టుచుండెనుగాని అందనేకములు ప్రస్తుతపు శాస్త్రజ్ఞానమును బట్టి మిక్కిలి హాస్యాస్పదముగ తోచక మానవు.

కలరాసూక్ష్మజీవియొక పురుగు.

కలరావ్యాధిని పుట్టించు సూక్ష్మజీవి ఒకవిధమైన పురుగని చెప్పవచ్చును. మేము పురుగని వ్రాసిన తోడనే రోకలి బండవలెగాని, చలిచీమవలెగాని, ఉండెడి యేదోయొక పురుగని మీరూహింపవలదు. ఈపురుగు అంగుళములో ఎనిమిది వేలవంతు పొడవును, ఆ పొడుగులో ఆరవ వంతు లావును గలిగి యుండును. మనరక్తమందలి ఎర్ర కణముయొక్క పరిమాణములో రమారమి మూడవ వంతుండును. ఇది సూక్ష్మకంపక యను నొకజాతి సూక్ష్మజీవి. సూక్ష్మజీవి యనగా మిక్కిలి చిన్నదైన ప్రాణి. జీవశాస్త్రముయొక్క రెండవకూర్పునందలి

32-వ పుటచూడుము. దీని యాకారము కొంచె మించుమించుగా కామా (,) వలెనుండును. క్రింది పటముజూడుము.

తెడ్లవంటి తోకలతో నీదును.



కలరా సూక్ష్మజీవులు.

రోగి విరేచనములో నొకబొట్టును నీలిమందు మొదలగు కొన్ని రంగులలో కొన్ని కొన్ని రీతులను కొంత కాలమూరనిచ్చి సూక్ష్మదర్శినితో పరీక్షించిన కామావంటి దాని శరీరముయొక్క ఒకకొనయందు మిక్కిలి సూక్ష్మమైన పొడుగాటి తోకవంటి మృదురోమమొకటి (ఒక్కొక్కప్పుడు రెండుగాని) అంటియున్నట్లు కనబడును. ఈతోకలు సూక్ష్మజీవియొక్క శరీరముకంటె రెట్టింపుమొదలు అయిదురెట్లవరకు పొడుగు గలవిగా నుండును. కాని మిక్కిలి సున్నితమైనదగుటచే అతి తీక్ష్ణమైన దృక్ఛక్తిగల సూక్ష్మదర్శనులతో మాత్రమే దీనిని కనిపట్టగలము. ఈ తోకలెల్లప్పుడు మిక్కిలి వేగముగా కొట్టుకొనుచుండును. నిరంతరము తెడ్లవలె నాడుచుండెడు

ఈశోకల సహాయముచే నీసూక్ష్మజీవు లెల్లప్పు డును చురుకుగ నీదుచుండును.

కలరా సూక్ష్మకంపక నిరంతరము ద్విఖండన విధానముచే అనగా మధ్యకు రెండు ముక్కలుగా తెగుచుండుటచే సంతాన వృద్ధి జెందుచుండును. జీవశాస్త్రము 16-వ పుట చూడుము. ఇట్లు తెగిన రెండు ముక్కలును తల్లులై వీనినుండి రెండు పిల్లలు పుట్టును. ఈప్రకారము నాలుగు ఎనిమి దియై, ఎనిమిది పదియారై, పదియారనేక పదియా రులై, అతిశీఘ్రమువనే వృద్ధి నొందుచుండును. ఇట్లు తల్లులును పిల్లలును, విరామము లేకుండ పిల్లల బెట్టుటచే ఇరువది నాలుగు గంటలలోపల దానికి తగిన యాహారము దొరికినయెడల ఒక్క తల్లి సూక్ష్మజీవినుండి ఒకకోటి అరవైలక్షల పిల్ల సూక్ష్మజీవులు పుట్టునని లెక్కింపబడినది. దినమునకు కోటి అరు లక్షల పిల్లలు

ఈవ్యాధి మనము తిను యాహారము త్రాగునీరు మూలమునవే వ్యాపించుచున్నదనుటకు నిదర్శనము లెవ్వి ?

తంజావూరు రయిలుస్టేషనులో అమ్మిన ఉప్పు పిండిని రైలులో చెన్నపట్టణము వచ్చుచుండెడు డిప్టికలెక్టరొకరు కొనుక్కొని తినెను. తాను తినగా ఆహారము.

మిగిలిన కొంత ఉప్పుపిండిని చెన్నపట్టణమునకు వచ్చిన తరువాత తనఅన్న వంటవానికిచ్చెను. ఇద్దరికిని మరునాడే కలరా వచ్చెను. వీరి విరేచనములను సూక్ష్మదర్శనితో శోధనచేయగా కలరా సూక్ష్మజీవులు స్పష్టముగ కనబడినవి. ఆహారము మూలమున కలరా వచ్చుననుటకు ఇంతకంటె నిదర్శనము కావలెనా?

ఒకటే నూతి నీరు త్రాగిన వేరు వేరు పేటల లోని జనులు చచ్చుట.

1. 1854 సం॥ ఆగస్టునెలలో లండను పట్టణమునందొక పేటలో కలరా వ్యాధి మిక్కిలి మిక్కుటముగనుండెను. అప్పుడు డాక్టరుస్నోగారు ఈవిషయమును కనిపెట్టియున్నారు. శెప్టెంబరు రెండవ తేదిని ఆపేటలోని పెద్దవీధి 49 నెంబరు ఇంటిలో ఒకబిడ్డ మూడు నాలుగురోజులు కలరాచే పీడింపబడి కాలముచేసెను. ఈరోగియొక్క విరేచనములు మొదలగునవి వారి ఇంటి ప్రక్కనుండు ఒక మురుగు గుంటలో వేయబడెను. ఆమురుగు గుంట అడుగున ఒక పగులుండి ఆ పగులుగుండ దాని ప్రక్కను గజము దూరములో ఉండెడి యొక నూతిలోనికి ఊటదిగె నని తరువాత కనిపెట్టిరి. ఆగష్టు 31 వ తేది రాత్రి ఆనూతి నీళ్లు ఉపయోగించిన మనుష్యులకు అందరకు కలరా తగిలి అనే

కులుమృతి నొందిరి. శెప్టెంబరు 2వ తేదిని ఆపేటకు దూరములోనున్న మరియొక పేటలో నుండెడి యొక స్త్రీ కలరావల్ల మృతినొందెను. ఆ పేటలో అంతకు పూర్వమెన్నడును కలరా లేక పోవుటచేత అక్కడి వైద్యులకు ఆశ్చర్య కరముగా దోచి తగు విచారణచేయ మొదలిడిరి. పైన వ్రాయబడిన పెద్దవీధిలోని నూతి సమీపమున ఆమె కొంతకాలము నివసించుచుండెననియు, ఆమె కానీటియందు మిక్కిలి యభిలాష గలిగి యుండుటచేత మరియొక పేటకుబోయి నివసించుచుండినను, ఆనూతి నీటినే తెప్పించుకొని త్రాగు చుండెడి వాడుక గలదు అనియు తెలియవచ్చెను. ఆగష్టు 31 వ తేదీయందును, శెప్టెంబరు 1 వ తేదీయందును కూడ ఆ నూతినీరు దెప్పించి త్రాగెను. శెప్టెంబరు 1 వ తేదిని ఆమెకు కలరాతగిలెను. ఆరోజుననే ఆమెను చూడవచ్చిన ఆమెమేనగోడలు గూడ ఆనీటిని కొంచెము త్రాగెను. ఆమెకుకూడ కలరాతగిలి మృతి నొందెను. ఆనీటిని త్రాగిన యొకనౌకరుగూడ కలరాచే పట్టుబడెను గాని కొంతవరకు బాధపడి జయించెను. మిక్కిలి శ్రద్ధగా గాలించి వెదకి నప్పటికిని ఈ మనుష్యులకు ఆనూతి నీటిసంబంధముతప్ప ఒకరొకరికివేరేసంబంధమేమియు కానబడలేదు. వారు

నివసించు పేటలో ఆ ఇంటియందు తప్ప మరియే ఇంటియందును కలరాయుండియుండలేదు. కాబట్టి ఈ కలరాను పుట్టించెడు కారణమెద్దియో ఆనూతి నీటినుండియే వచ్చి యుండవలెనని దృఢమైన నమ్మకము గలుగుచున్నది.

కలరా సూక్ష్మజీవి నీటిమూలముననే వ్యాపించుననెడు సిద్ధాంతము స్థిరపరచుటకై సర్ పేట్రిక్ మాన్సన్‌గారు ఈక్రిందిప్రకారము వ్రాయుచున్నారు.

ఒకవీధిలోనొక ప్రక్క ఇండ్లలో కలరావ్యాపించి రెండవప్రక్క ఇండ్లలో లేకపోవుట.

2. జర్మనిలో హేంబర్గు, ఆల్టోనా, అను రెండుపట్టణములు ఒకదానినొకటి చేరియున్నవి. రెండుపట్టణముల మునిసిపాలిటీవారును ఒకటేనది నుండి ప్రజలకు కావలసిన నీటిని సప్లయిచేయుచుండెడివారు. అల్టోనా పట్టణపు మునిసిపాలిటీవారు మిక్కిలి శ్రద్ధతో వడపోయించి పరిశుభ్రమైన జలమును ప్రజలకు ఇచ్చుచుండిరి. కాని హేంబర్గు పట్టణపు మునిసిపాలిటీ వారట్లుచేయక నదిలోనుండి తోడించిన నీటిని కాలునల గుండ వడబోయకుండగనే ప్రజలకిచ్చుచుండిరి. హేంబర్గు పట్టణమునందు కలరా సోకినప్పుడు 8605 గురు అనగా జనసంఖ్యలో వేయింటికి 13½

చొప్పున మృతినొందిరి. అదే సమయమున అల్టో నాలో కలరా వ్యాపించియున్నపుడు 328 గురు అనగా జనసంఖ్యలో వేయింటికి ఇద్దరుచొప్పుననే మృతినొందిరి. హేంబర్గుయును అల్టోనాయును ఒకదానినొకటి జేరియుండుటచేత రెండును ఒకే పట్టణములోని రెండుపేటలవలె నున్నవని చెప్ప వచ్చును. ఒకభాగమున రెండు మునిసిపాల్టీలకు ఒకవీధి సరిహద్దుగానుండెను. ఆవీధికి ఒకవైపున హేంబర్గు మునిసిపాల్టీలోచేరిన ఇండ్లును, రెండవ వైపున అల్టోనా మునిసిపాల్టీలో చేరిన ఇండ్లును, గలవు. ఆ వీధియందు హేంబర్గు ప్రక్కనుండెడు ఇండ్లలో కలరావలన లెక్కలేకుండ చనిపోవు చుండిరి ; అల్టోనా ప్రక్కనుండెడు ఇండ్లలో ఒకని కైనను కలరా సోక లేదు. ఆవీధియొక్క రెండు ప్రక్కలనుండు ఇండ్లును ఒకటేరీతిని కట్టబడియుం డెను. ఆ ఇండ్లయందు నివసించు వారందరును ఒక తరగతివారే. ఈ రెండు ప్రక్కలనుండు జను లకు భేదము ఒక్కనీటి సప్లయి విషయములో తప్ప మరి ఏవిషయము నందును గానరాకుండెను. కలరా లేని ప్రక్క నుండెను. ఇండ్లలోని వారు

అల్టోనా నీరు త్రాగుచుండిరి. కలరాసోకిన ప్రక్క నుండెడు జనులు హేంబర్గు నీరు త్రాగుచుండిరి. ఇంకను విచిత్రమేమనగా, హేంబర్గు ప్రక్కనుండెడు కొన్ని ఇండ్లలో సయితము కలరా సోకియుండలేదు. దీనికి కారణమేమని శోధింపగా ఆ ఇండ్లకు వచ్చునీటి గొట్టము అల్టోనా పట్టణపు పెద్ద గొట్టములో నుండి పుట్టుచుండెనని కనిపెట్టబడినది.

నీటియొక్క అశుభ్రతతో పాటుకలరా హెచ్చును.

3. దీనిని బట్టి చూడగా నీటియొక్క శుభ్రత అశుభ్రతలను బట్టి కలరాయొక్క వ్యాపకము హెచ్చుచు తగ్గుచుండునని స్పష్టముగ తెలియగలదు. ఈవిషయమై చక్కగ చదువరులకు బోధించు నిమిత్తమై ఇంకొక యుదాహరణము నిచ్చెదము. 1854 వ సం॥ మున లండను పట్టణమునందు కలరా వ్యాపించియుండెను. ఆ పట్టణమునందలి దక్షిణ భాగమునందలి పేటలకు రెండు కంపెనీల వారును నీరు సప్లయి చేయుచుండిరి. రెండు కంపెనీలవారును కూడ తేమ్సు నదినుండి నీటిని గొట్టముల ద్వారా రప్పించుచుండిరి. అందొక కంపెనీవారు తాము నీటిసప్లయిచేయు పెద్ద కాలువను పట్టణము ఎగువ వైపునను నదిభాగమునుండియేర్పరచుకొనిరి. రెండవకంపెనీవారు అట్లు

గాక పట్టణము దిగువ వైపుననుండి యేర్పరచు కొనిన కాల్వలగుండ నీటిని సప్లయి చేయుచుండిరి. అట్లు చేయుటచే మొదటి కంపెనీవారు సప్లయి చేయుచుండెడి నీరు పరిశుభ్రమైనదిగను, రెండవ కంపెనీవారు సప్లయి చేయుచుండెడి నీరు మలిన మైనదిగను ఉండెను. మొదటి కంపెనీవారు సప్లయి చేయుచుండెడి భాగములయందు జన సంఖ్యలో 1000కి 2½యును రెండవకంపెనీ వారిచే నీటి సప్లయి కాబడినఇండ్లలో 1000 జనమునకు 15 గురు చొప్పునను కలరాచేత మృతి నొందిరి. ఈ రెండు కం పెనీలవారి నీటిగొట్టములను ఒకదాని ప్రక్కనొకటి పోవుచుండుటచే ఒకవీధిలోనికి కొన్ని యిండ్లకు ఒక కంపెనీవారును, మరికొన్ని ఇండ్లకు రెండవ కంపెనీ వారును నీరిచ్చుచుండిరి. మొదటికంపెనీవారి ఇం డ్లలో కలరాబొత్తుగ లేని కాలమందు రెండవకంపె నీవారిఇండ్లలో కలరా భయంకరముగ నుండెను.

కలరా సూక్ష్మజీవులు నీటిమూలమున మనశరీ రములోనికి వ్యాపించునని మేము చెప్పియున్నను పరిశుభ్రమైన నీరువానికి తగిన నివాసస్థానముగాదు. పరిశుభ్రమైన నీటిలో వానికి తగిన ఆహారము లేక పోవుటచేత అవి వృద్ధి నొందక కొద్దికాలములోనే

నీటియందుండునుటికియే కలరాసూక్ష్మజీవులకుఆహారము.

నశించును. కలరా సూక్ష్మజీవులకు నీటియందలి మురికియే ఆహారము. ఇవి తమకు నోరులేకున్నను ఈమురికినెట్లు తమశరీరములోనికి వ్యాపింపజేసికొని జీర్ణముచేసికొనునో తెలిసికొనగోరువారు జీవశాస్త్రము రెండవప్రకరణములో పూతిభుక్కుల ఆహారపద్ధతి చూడనగును. మనదేశమునందలి గంగా యమున మొదలగు కొన్నినదుల యందలి నీటి శుభ్రతనుగూర్చి అలహాబాదు కెమికల్ యగ్జామినరు హన్‌కిన్‌గారు ఈప్రకారము వ్రాయుచున్నారు:

గంగనీటిలో కలరాపురుగు చచ్చుట.

"కలరావలన చనిపోయినవారి కళేబరములను గంగానదిలో విడచుట తరుచు తటస్థించుచున్నది. కావున కలరాపురుగు ఆనీటిలో తరుచుగ ప్రవేశించును. కాని పెద్ద పెద్ద ఘట్టములదగ్గర తీర్థస్నానకాలమునందును, వర్షకాలమునందును తప్ప, కలరాపురుగునకు అనుకూలమగు మాలిన్యము ఈనది జలమందుండదు. అందుచేతనే ఈనదీజలమందు కలరా పురుగొక్కటి పడినను దానికితగిన ఆహారమక్కడలేనందున అది వెంటనే చచ్చును. గంగానదీప్రవాహమున కొట్టుకొనిపోవు మట్టిని సూక్ష్మదర్శనితో పరీక్షించునెడల చిన్న చిన్న రాతినలుసులును

ఇసుకయు తప్ప జంతు సంబంధమైన పదార్థమేమి యు అందు కనుపించదు. ఐనను యాత్రదినములలో స్నానములు చేయు పెద్దఘట్టములదరిని మానవుల చర్మపు పొరలును, చమటనుండియు వెండ్రుకలనుండియు పుట్టుచుండెడు పలువిధములైనజంతు సంబంధమైన పదార్థపు టణువులును కానబడును. అందుచే ఒక్కొక్కప్పుడు కలరా సూక్ష్మజీవులు యాత్రాపరుల స్నానములచే గంగానది యొక్క యొడ్డుదరిని రేవులలో కొంతవరకు వృద్ధినొందగలిగినను ప్రవాహముయొక్క వడిచేతను, వాయువు యొక్క ప్రసారముచేతను, కొట్టుకొనిపోయి నదీమధ్యముననుండు పరిశుభ్రమయిన నీటిలోనికిజేరి తమకు దగిన యాహారమక్కడ లేకపోవుటచే మృతినొందును. ఇది గాక సూర్యరస్మి కలరా సూక్ష్మజీవులకు ప్రబలమైన విరోధి."

పైన వ్రాసిన ప్రకారము గంగానదినీటిలో ప్రవాహము మధ్య కలరా సూక్ష్మజీవులు లేక పోయినను, మన గ్రామాదుల యందలి మురికిగుంటలలో వానికి తగిన ఆహారము కుప్పలుకుప్పలుగ నుండుటచేత అవి పండుగభోజనములుచేయుచు అతి శీఘ్రము

మన గ్రామములందలి మురికి గుంటలలోని మలినము కలరాకు పండుగభోజనము.

ముగ నెదిగి నిమిష నిమిషమునకు వందలు వేలకొ లది పిల్లలగాంచును. ఈసూక్ష్మజీవులయందు స్త్రీ పురుష భేదము లేక పోవుటచేత, ఇది మగది ఇది ఆడది యనక, ప్రతిదాని నుండియు రెండేసి పిల్లలు పుట్టుచుండునని పైన చదివియున్నారు. నలుసువంటి యొక కలరా పురుగును దెచ్చి మన చెరువులోని మలి నమైన నీటిలో విడిచినయెడల మరునాటి యుదయ మునకు ప్రతినీటిబొట్టునందును ఈపురుగులు లక్షల కొలది యుండుటచే నీరంతయు కలక బారునంత సంతానవృద్ధి జెందును.

అంట్లు తోము టకుపయోగిం చిన నీటిమూల మున కలరా వచ్చుట.

కలరా సూక్ష్మజీవులు గల నీటిని త్రాగుటవలన మాత్రమేగాక అట్టి నీటిని గృహోపకరణములను తోముకొనుటకు ఉపయోగించిన గూడ ఈవ్యాధి వానిగుండ వ్యాపించగల దనుటకు నిదర్శనములు గలవు. ఈవిషయమై యొక డాక్టరిట్లు వ్రాయు చున్నారు. "ఒకానొక గ్రామములో నొకనాడు ఈ జాడ్యముచే ఏడుగురు చచ్చిరి. అప్పుడు ఆగ్రామ మునందు కలరా ఎట్లు వ్యాపించినదని తెలిసికొను టకై నేనుపోయి యుంటిని. విచారణమీద ఈ ఏడుగురును వేరువేరు నూతుల జలమును త్రాగి

నట్లును తెలిసినది. కానివారందరును ఒక్క భాష యొద్ద తోమినపాత్రల నుపయోగపరచి ఋజువు పడినది. దీనివలన వీరి కీవ్యాధి సోకినట్లు దృఢముగ నమ్మదగియున్నది. లేనిచో ఆగ్రామమునందితరులకు ఎవ్వరికిని లేక ఈపదుగురికి మాత్రము కలరా వచ్చుటకు కారణమేమి?"

ఈకలరా సూక్ష్మ జీవులు పరిశుద్ధ జలమునందు మరుగునీళ్లలో చిరకాలము జీవింపజాలవని వ్రాసియుంటిమి. అపరిశుద్ధ జలమునుండి సహితము వానిని నశింపచేయుట ఎక్కువ కష్టతరముగాదు. ఏలయన కలరా సూక్ష్మజీవులు 100-డిగ్రీల వేడితగిలిన జీవింపనేరవు. మనము సామాన్యముగా మరగించు నీటియొక్క వేడిమి 100 డిగ్రీలుండును. కనుక నీటిని పొంగునట్లు కాచునెడల అందు ఈ జీవులు అన్నియు మృతినొంది యుండుననుటకు సందేహములేదు. కలరాసూక్ష్మ జీవులు చచ్చును.

ఇందుకు నిదర్శనమేమనగా ఒకసారి యొకసేనయందు కలరా మిక్కుటముగావ్యాపించియుండెను. అప్పుడు వానికారణమును గూర్చివిచారణజరిగెను. శిపాయీల కంపెనీల కన్నిటికిని ఒకటేవిధమయిన ఆహారము సప్లయికాబడెను. కాని ఆ కంపెనీలలో

కలరాజాడ్యము మిక్కుటముగ వచ్చినప్పుడందొక్క కంపెనీయందు మాత్రము జాడ్యము లేక యుండెను. ఇట్లు ఒక్క కంపెనీ మాత్రమే యీజాడ్యమునుండి తప్పించుకొనుటకు కారణమును మొదట ఎవ్వరును కనుగొన లేకపోయిరి. పిమ్మట విచారింపగా ఆ కంపెనీ కధికారియైన ఉద్యోగస్థుడు తనకంపెనీ జనులకు త్రాగుటకు కావలసిన యుదకమును చక్కగ కాపించి ఇచ్చుచుండె నని తెలియవచ్చినది. ఇందుచేత ఆకంపెనీలోని జనుల కెవ్వరికిని కలరా రాకపోవుటకు కారణము స్పష్టపడుచున్నది. మనగ్రామములందు జబ్బుగానున్నవారికి వేడినీళ్లు దాహమునిచ్చు ఆచారముగలదుగదా. పైనజరిగిన సంగతినిబట్టిచూచిన కలరాసోకియుండు సమయములయందైనను జబ్బులేకుండునట్టి మనుష్యులుకూడ ఆయాచారమునే యవలంబించుచు కాగి చల్లారిన నీటినే త్రాగుటవలన ఈభయంకరమగు వ్యాధినుండి తప్పించుకొనగలరని తెలిసికొనగలరు.

కలరాకు ఇతర వాహకులు-ఈగలు, దోమలు.

పైనజెప్పిన ప్రకారము నీరేగాక కలరా సూక్ష్మజీవులను మోసికొనిపోవు ఇతరవాహకులును కొందరుగలరు. ఈవాహకు లెవ్వరన ఈగలు దోమలు

మొదలగు చిన్న చిన్న పురుగులు. చెడుగాలిని పీల్చు టచేత కలరా జాడ్యము కలుగనేరదని శాస్త్రజ్ఞు లిప్పుడు దృఢపరచియున్నారు. అప్పుడప్పుడు మన ము తిను ఆహారమువలనగూడ కలరా సంభవించు టగలదు. చెడువాసన లున్న చోట్లను ఈగలువిస్తరిం చియున్న చోట్లను ఇది తటస్థించుచుండును. కలరా వచ్చి యుండెడివాండ్రు విసర్జించెడు మలమూత్రా దులమీాద నీ యీగలు(వాలి, వానియందు కుప్పలు కుప్పలుగనుండు కలరా సూక్ష్మజీవుల తమ శరీరము లపై ధరించి వానిని స్థలాంతరములకు జేర్చును. ఈ కారణముచేత ఎల్లప్పుడుమురుగుకాలువలనుండి మి ఠాయిదుకాణము మీాదికిని, మిఠాయిదుకాణమునుం మురుగుకాలువమీాదికిని గంతులువేయుచు రాయ భారము జరుపు ఈగల సందడిని జూచుచు మనమెన్న డునుఅట్టి సంపర్కముగల పదార్థముల భుజియింప ఈయీగలు మరుగుదొడ్లనుండి తమ కాళ్లతో కల రాసూక్ష్మజీవుల నీడ్చుకొనివచ్చుటయేగాక రోగుల యొక్క మలమును తినునట్టి, ఈజంతువుల మలము నందుగూడ కలరా సూక్ష్మ జీవులు మరింత చురుకు తనముగలవై విషపూరితములై యుండును. 1896వ

సంవత్సరములో బంగాళా దేశములోని యొక జయిలులో కలరా పుట్టినపుడు ఈసంగతి రుజువు పరచబడినది. అప్పుడు అచ్చటి ఉదకమును పరీక్షించి చూడగా అందు కలరా సూక్ష్మ జీవులేవియు కనుపించలేదు. కాబట్టి ఈజాడ్యమువచ్చుటకు కారణము మరియొకటి యేదియో యుండవలెనని చాలవరకు విచారణ జరగినపిమ్మట అక్కడ ముసురు చుండెడి ఈగలే దీనివాహకులని డాక్టరులు కనుగొనిరి. ఈసంగతి రుజువుపరచుటకుగాను చెరసాలయం దచ్చటచ్చట కుండలతో కాచిన పాలుంచబడెను. కాచినపాలలో సూక్ష్మజీవులు లేవనుట మీకు తెలిసియేయున్నది. కొంతకాల మాపా లట్లుండనిచ్చినతరువాత, వానిని పరీక్షించిరి. అందుకొన్ని కుండలలో ఈగలు పడి పాలలో మునిగియుండెను. అట్టికుండలన్నిటి యందును కలరాసూక్ష్మజీవులును సమృద్ధిగనుండెను. ఈగలువ్రాలనికుండలలో కలరా సూక్ష్మజీవియొక్కటైనను లేదు. దీనినిబట్టిచూడ ఈగలు కలరావ్యాధియొక్క వ్యాపకమునకు సహాయకారు లనుటకు సందియము లేదు.

కలరా సూక్ష్మజీవులేనా కలరాకు కారణములు.

కలరా రోగినుండి వెలువడు విరేచనములలో పైని వివరించిన ప్రకారము ఒకజాతి సూక్ష్మజీవులు ఎల్లప్పుడు కనబడుచుండుటచేత, ఈసూక్ష్మజీవులు కలరావ్యాధికి కారణము లని ఊహింప తగియున్నది. అయినను ఈ సూక్ష్మజీవులే ఈ వ్యాధికి కారణము లని పూర్ణముగా ఋజువు పరచుటకుగాను ఈ సూక్ష్మజీవులుగల నీటిని కొందరికిచ్చి త్రాగించి చూడవలెను. ఇట్లు త్రాగినవారలకు నిజమయిన కలరా సోకినయెడల ఈసూక్ష్మజీవులే వారి కలరాకు కారణము లని నిశ్చయముగా జెప్పవచ్చును. కాని అట్లు మానవులకు ఉద్దేశపూర్వకముగా కలరా సూక్ష్మజీవులనిచ్చి పరీక్షించుట మిక్కిలి ఘోరమయిన పాపకృత్యముగదా! మానవునిక్రిందిజాతి వగు పశువులు కుక్కలుమొదలగు జంతువులచే కలరా సూక్ష్మజీవులుగల నీటిని త్రాగించిన వాని కెట్టిరోగములు వచ్చుటలేదు. కాన నీ సూక్ష్మజీవి మానవుని మాత్రము హింసించునదిగా కనబడుచున్నది. పశ్వాదుల జీర్ణరసములలో కలరా సూక్ష్మజీవులు జీర్ణమయి నశింపై పోవునని కనిపెట్టిరి. అయినను జాబ్లాట్స్కి అనునాతడు ఉడతలకు ఈకలరా సూక్ష్మజీవులుగల నీటినిత్రాగనిచ్చి శోధనలుచేసి, మానవులకు గలుగు

నట్టి వ్యాధియే వానియందును గలుగుచుండుటయు, వాని పేగులందును మలమూత్రాదుల యందును కామాలవలె నుండు నీ కలరా సూక్ష్మజీవు లుండుటయు కనిపెట్టియున్నాడు.

కలరా సూక్ష్మ జీవులుగల నీటిని త్రాగినను వ్యాధి రాక పోవుట.

ఒకానొకప్పుడు ఒకవైద్యశాలలో ప్రమాదవశమున నొకకలరా రోగియొక్క విరేచనము కొద్దిబిందెలనీళ్లుగలఒక మంచినీటికొట్టములో కలియుట తటస్థించెను. ఇది పన్నెండుగంటలు ఎండలోనుండెను. మరునాడుదయమున పందొమ్మండుగురు రోగులు మనిషి ఒక్కంటికి అరగిద్దెడు చొప్పున అవుషధముతోపాటు ఆనీటిని త్రాగుట తటస్థించెను. ఆపందొమ్మండుగురిలో అయిదుగురికి ముప్పదియారుగంటలలోగా కలరా సోకినట్లు డాక్టరు మెక్కమూరాగారు వ్రాయుచున్నారు. కాబట్టి కలరా పుట్టుటకు కలరాసూక్ష్మజీవులు మనకడుపులో ప్రవేశింపవలయు ననునది ఒక ముఖ్యమయిన అంశమయినప్పటికిని, కలరాసూక్ష్మజీవులు మనకడుపులో ప్రవేశించినంత మాత్రమున తప్పక కలరా వచ్చితీరవలయునని నిర్ధారణగా చెప్పుటకు వీలులేదు. ఏలయన కలరా సూక్ష్మజీవులుగల నీటిని పందొమ్మండుగురు త్రాగినప్పుడు అందులో అయిదుగురు తప్ప తక్కినవారు తప్పించుకొనిపోవు

టకు కారణమేమి? దీనిని బలపరచుటకై మరి రెండు మూడు అంశములు గనబడుచున్నవి.

1. అనేకసారులు శోధన నిమిత్తమై కొందఱు శోధకులు పరీక్షార్థము కలరా సూక్ష్మజీవులుగల నీటిని త్రాగియున్నారు. వారిలో ననేకులకు కామా వంటి సూక్ష్మ జీవులతో నున్నవిరేచనములు కలిగెనుగాని నిజమయిన కలరా చిహ్నాలు ఎక్కడనో ఒకరిద్దరికి తప్ప తరుచుగ కలగలేదు. ఈకారణముచేత కొందరు కలరాకు కారణము కామాసూక్ష్మజీవులు కావని తలచుచున్నారు. మఱికొందరు కామా సూక్ష్మజీవులుగాక ఏదో ఇంతవరకు మనకు తెలియని సూక్ష్మజీవికూడ దానితో చేరియుండవలెననియు, ఈరెండును చేరియున్నప్పుడుగాని నిజమైన కలరా రాదనియు వ్రాయుచున్నారు. కలరాసూక్ష్మజీవులు పెరుగుటకు తగినట్టి కొన్ని ఇతర కారణములు ఒక మానవునియందుండిన గాని వానికి కలరా సోకదని కొందరును కలరా సూక్ష్మజీవులయొక్క రౌద్రము మనము వాసిని పెంచినపుడు తగ్గిపోవుచున[illegible] అట్టి పెంపుడు కలరా సూక్ష్మజీవు[illegible] లను శోధకులు త్రాగుటచే వా[illegible] యదనియు మరికొందర[illegible]

శోధకులు కలరా సూక్ష్మజీవులను మ్రింగుట.

కలరా రోగియొక్క విరేచనములలో సూక్ష్మజీవులు లేకపోవుట.

2. ఇదిగాక చూచుటకు నిజమయిన కలరాయని తోచిన రోగుల యొక్క విరేచనములలో ఒకానొకప్పుడు మిక్కిలి శ్రద్ధగ పరీక్షించి నప్పటికిని కామా సూక్ష్మజీవులు కనబడలేదని కొందరు వాదించుచున్నారు. అట్టివాదమును పెక్కులంగీకరింపక వారిశోధనలయందు ఏదోయొక విధమయిన లోపముండి యుండవచ్చుననియు, ఒక్కొకరోగియొక్క విరేచనములలో వీరు పరీక్షించినప్పుడు లేకున్నను ఎప్పుడో మరియొకప్పుడైనను, ఈకలరా సూక్ష్మజీవులుండి యుండవచ్చుననియు చెప్పుచు పైవారివాదము త్రోసివేయుచున్నారు.

ఇతరులవిరేచనములలో కూడ నీ సూక్ష్మజీవులు కనబడుట.

3. కలరా ఎన్నడును సోకియుండని కొందఱి జనుల విరేచనములో కలరాసూక్ష్మజీవులు అప్పుడప్పుడు కనిపెట్టబడినవి. ఇందుకు జవాబుగా కలరా సూక్ష్మజీవులు వారిపేగులలో పెరుగుటకు తగిన సదుపాయ మేదియో యొకటియున్నదనియు వాని విషములు వారి రక్తములోనికి వ్యాపించుటకు తగిన సదుపాయము లేనియో లేవనియు చెప్పు

కాఫక్ అను డాక్టరు కలరా సూక్ష్మ
...ను ముఖ్యాంశములు ఉండవ
1 కామా సూక్ష్మజీవులు.

2. ఇరుగుపొరుగు ప్రదేశముల ఆరోగ్యస్థితి.

3. రోగియొక్క సహజమయిన దేహస్థితి.

ఇందు మొదటిది ఉన్నను రెండుమూడు స్థితులు లేనప్పుడు వ్యాధికలుగనేరదు.

కలరా సూక్ష్మజీవులను కోతులు చెవులపిల్లులు కుక్కలు మొదలగు క్రిందితరగతి జంతువుల రక్తములో ప్రవేశింప జేసినను, నిజమయిన కలరా వానికి సోకకుండుట కలరా సూక్ష్మజీవులవల్లనే కలరా వచ్చుచున్నదను వాదమునకు వ్యతిరిక్తమయిన అంశములలో బలమయినదని తెలిసికొనగలరు.

కోతులు మొదలగు జంతువులకు కలరా యెన్నడును రాదు.

అధికాయాసము, మనోవిచారము ఈ రెండును గల సమయములలో తగిన ఆహారముగూడలేని యెడల అట్టివారియందు కలరా శీఘ్రముగ ప్రబలును. పరిపూర్ణమయిన దేహారోగ్యము ననుభవించెడు వారియొక్క జీర్ణాశయమునందును పేగులయందును కలరా సూక్ష్మజీవులు పెక్కులుగనున్నను వ్యాధిని కలుగజేయనేరవని కొందరు నిశ్చయించి యున్నారు. పరీక్షార్థమై కొందరు శోధకులు కలరా సూక్ష్మజీవులతో క్రిక్కిరిసియున్న పానకములను త్రాగినను రోగ పీడితులుగాకుండుటను గూర్చి చదివియున్నారుగదా. మన జీర్ణకోశమునందు స్రవించు జీర్ణరస

కలరాసోకుటకు అనుకూలమయిన స్థితిగతులు.

పెంపునకు మిక్కిలి అనుకూలమైన తోటములని, ధృఢముగఁ జెప్పవచ్చును.

నిద్రలేమి. నాటకములనుచూచుట, హరికథలువినుట, జూదములు, మొదలగు వానిచే రాత్రులయందు నిద్రలేమివలన గలుగుబడలికయు, వీనివలన గలుగు నజీర్తియుగూడ ఈసూక్ష్మజీవులతో పోరాడుటకు మనకుండు శక్తిని వేయింతలు తగ్గించును.



## రెండవ ప్రకరణము.

### కలరా సూక్ష్మజీవియొక్క వాహనములు.



మొదటి ప్రకరణములో కలరావ్యాధి యొక్క మైలపడుట అననేమి. నొక విధమయిన సూక్ష్మజీవి వలన గలుగుచున్నదని తెలిసికొని యున్నాము. ఆసూక్ష్మజీవియొక్క సంపర్కము మూడు విధములుగ గలుగుచున్నది.

i తాకుట వలనను

ii నీటిమూలమునను

iii గాలిమూలమునను;

ఇట్లు ఏవిధముచేతనయినను కలరా సూక్ష్మజీవుల సంబంధమయిన సంపర్కమును. అనగా, మాలినమును సంపాదించుకొనుటయే మైలపడుట అని చెప్పుదుము.

i. తాకుటవలన గలుగు సంపర్కము. తాకినమైల.

తాకుటవలన సంపర్కము రెండువిధములగలుగవచ్చును.

i. వ్యాధిలేని ఒకమనిషి వ్యాధిగల మరియొక మనిషినిగాని వాడుకపయోగపరచిన బట్టలు పాత్ర

ము॥ బంట్లు పడవలు మొదలగు వాటినిగాని తాకి కలరా సంబంధమైన మలినమును స్వయముగా సంపాదించు కొనుట.

2. వ్యాధిగల మనిషినితాకిన, మనుష్యులు కుక్కలు, పిల్లులు, ఈగలు, దోమలు, మొదలగు జంతువులు ఆరోగివద్దనుండి మలినమును తెచ్చివ్యాధిలేని మరియొక్క మనిషికి అంటించి వానిని మైలపరచుట

ఈ రెండువిధములచే గలిగిన మైలకు తాకిన మైల అనిపేరు.

II. నీటిమూలమున కలుగు సంపర్కము.

నీటిమైల. కలరా వ్యాధివలన మైలపడిన ఏమనిషి అయినను చెరువులోగాని, నదిలోగాని, కాలువలోగాని, దేహమును కడుగుకొనిగాని, బట్టలుతుకుకొనిగాని, ఈవ్యాధి కారణములగు సూక్ష్మజీవులను ఆనీటిలో కలిపినయెడల అట్టినీటిని, ఆరోగి మైలపరచినవాడగుచున్నాడు. అట్టినీటిని ఉపయోగించు జనులందరును మైలపడినవారగుదురు. ఇట్టిసంపర్కమునకు నీటిమైల అనిపేరు.

III. గాలిమూలమున గలుగు సంపర్కము.

గాలిమైల. కలరా సూక్ష్మజీవులంతగా, గాలి ద్వారావ్యాపింపక పోయినను, మసూచికము, పొంగు, ఆటల

మ్మ, గనదలు, మొదలగు కొన్ని వ్యాధులను కలు గజేయు సూక్ష్మజీవులు గాలిలో ప్రయాణము చేయును. ఇట్టి సూక్ష్మజీవుల సంపర్కముచే మైలపడినగాలిని, పీల్చుజనులందరును మైలపడినవారగుచున్నారు. కలరా సూక్ష్మజీవి గాలిలో నెగిరిపోవునప్పుడును, ఎండలో ప్రయాణము చేయునప్పుడును, శీఘ్రముగా చచ్చిపోవుటచేత మైలపడిన గాలి యెప్పటికప్పుడు శుద్ధియగుచున్నది. కావున నిట్టి గాలి మైలమూలమున కలరా అంతగా వ్యాపించదు.

పై వివరించిన మూడు విధములచేతను మనకు మైలసోకవచ్చునుగదా? అట్టిమైల మనలను సోకకుండ జేసికొనుటకు ఒక్కొక మైలకు వరుసగకొన్ని కొన్ని పద్ధతులను చెప్పెదము.

### 1. తాకినమైలకు శుద్ధి.

1. కలరా సూక్ష్మజీవుల సంపర్కముచే మైలపడిన మనిషినిగాని, జంతువునుగాని, వస్తువులనుగాని మనముతాకకూడదు. కాని ఇది సులభముగ సందర్భపడునా లేక అసందర్భమా, ఆలోచించుదము. మైలపడినవాని నెవ్వరును తాకకూడదు.

కలరా వ్యాధిగల ఒకమనిషిని ఎవ్వరును తాకకుండుట సాగదు. ఏలయన "పరోపకారార్థమి

దంశరీరం" అనునట్లు ఒకరికొకరు సహాయపడవల సినదే. అట్టిసందర్భములో, తమదగ్గర బంధువులకు గాని, స్నేహితులకుగాని, కలరా మైలసోకినప్పుడు వారిని ఎవ్వరు తాకకూడదను సూత్రము ప్రకారము వారిని అసహాయులుగా చావనిచ్చుట మిక్కిలి అధర్మముగదా. అట్టిసమయమున ఏమిచేయవలెను? ఒకానొకమనిషికి కలరావచ్చినప్పుడు, ఇంటిలో ఉన్నవారందరును ఆరోగినితాకి మైలపడక ఎవ్వరోఒకరుగాని, ఇద్దరుగాని, సాహసించి మైలపడి, తాము తిరిగి భోజనము మొదలగునవిచేయక పూర్వమే యీదిగువ నుదహరించు ప్రకారము మైలనుండి విముక్తులు కావలయును. లేదా ఇట్టి పనులకై ప్రత్యేకముగ ఏర్పడియున్న వైద్యులకును నౌకర్లకును రోగి నొప్పగించి తామూరక యుండవలెను.

శుద్ధిచేసికొనుటఅనగేమి.

ఏవిధముననైనను అంటుకొనిన మైలనుండి విముక్తుడగునట్లు చేసుకొనుటయే శుద్ధి చేసుకొనుట అనిచెప్పుదుము. ఇట్టి శుద్ధిచేసికొను విధములు అనేకములు గలవు. డాక్టర్లకు చక్కగ తెలియును. మిక్కిలి ఉపయోగకరమైన వాని నొకటి రెండింటిని క్రింద వివరించెదను.

కలరారోగిని తాకిన ప్రతిమనిషియును తనపని తీరినతోడనే చేతులను మొదటసబ్బు, కుంకుడుకాయ, శీకాయ మొదలగువానితో తోమి మిక్కిలి శుభ్రముగ కడుగుకొని పిమ్మట మందునీళ్లలో ముంచి అయిదు నిముషములకు తక్కువకాకుండ నుంచవలెను. ఇందులకుపయోగించుమందు నీళ్లు పెక్కులు గలవు. అందు మూటిని క్రిందవివరించితిమి. కలరారోగిని తాకినమనిషి కి శుద్ధి యెట్లు.

1. కార్బాలికుమందునీళ్ళు

(Carbolic lotion)

కార్బాలికుఆసిడ్డు 1 పాలు.
వేడినీళ్లు 40 పాళ్లు.
చక్కగ కలపవలెను. లేనియెడల చేతులమీాద పుండ్లుపుట్టును.

2. లైసాలు 1 పాలు. కలపవలెను.
నీళ్లు 100 పాళ్లు.

3. సౌవీరపుమందునీళ్లు.

(Per Chloride of Mercury lotion)

3. సౌవీరము 1 పాలు.
నవాసాగరము 1 పాలు.
నీళ్లు 100 పాళ్లు.

కుండలోపోసి కడ్రంలో కలపవలెను. లోహపు పాత్రము లుపయోగింపకూడదు.

ఈ మందునీళ్లలో సూక్ష్మజీవులను చంపుగుణము కలదు. ఈమందునీళ్లను క్షణములో తయారు చేసికొనుటకు తగినమాత్రలు మందుల షాపులలో దొరకును.

తానదివరకు కట్టుకొనియున్న బట్టలను విసర్జించి మడిబట్టలను కట్టుకొనవలెను. తానువిడిచినబట్టలను మరుగుచుండు నీళ్ళలోవేసి ఉడకవేసి ఎండలో నార వేయవలెను. లేదా వానిని వేరుగాపెట్టి చాకలి వానికి వేసినయెడల వాడు ఉడకవేయును.

బడిపిల్లలు మైల లోకలుపుట. ఇప్పుడు వాడుక మారిపోయినదిగాని మాచిన్న నింటితనములో బడికివెళ్ళివచ్చినందువలననే మేముకట్టుకొనిన బట్టలు మైల పడిపోయిన వని ప్రతిదినమును ఇంటికిరాగానే ఆబట్టలను విడచి తడిగోచిపెట్టుకొని మడిబట్టలను కట్టుకొనెడు వారలము. కాని మా పెద్దలెందు కట్లుచేయించు చుండిరో ఆకారణము మాకు తెలియనందున మామనఃపూర్తిగాకాక బల వంతముమీద మేమట్లుచేయుచుంటిమి. అందుచేత రహస్యముగా ఎవ్వరును చూడనప్పుడెల్లను, మైలను ఇంటిలోకలిపి, ఇంతపని నెవ్వరునుచూడకుండ చేసి

తిమిగదా అని లోలోపల సంతోషించెడి వారలము. ఏలయన అట్టి పనివలని అపాయమెట్టిదో మాకు ఎవ్వరును నచ్చచెప్పెడివారు కారు. మైలను ఇట్లు కలుపుటవలన కలరా మొదలగు అంటు వ్యాధుల వ్యాప్తికి మేము కారకుల మగుదుమని మాకు నచ్చచెప్పినచో మేమెన్నడును మైలను ఇంట్లో కలిపియుండము.

ఈ ప్రకారము మైలను తాకకుండుటయు, మైలనుండి శుద్ధిచేసికొనుటయు మనదేశస్థులకు క్రొత్తగాదు.

అపరిశుభ్రముగానుండి ఇట్టి మైల మొదలగు వాని సంపర్కము చేరియుండదగినవారనెడు సంశయముచేత కాబోలు, శుచిగనుండు మనవారలు, అశుచిగనుండు మాలవాండ్రు మొదలగువాండ్రను, తాకకుందురు. అదిమిక్కిలి మంచిఅలవాటే. బహుశః ఇందుచేతనే ఎల్లప్పుడును మిక్కిలి శుచిగానుండు అగ్రవర్ణముల వారికి కలరా సూక్ష్మజీవుల మైల అంతగాసోకదు. కాని ఈవిధమయిన మైల తాకుటవలన సోకకుండవలెనను నెడల, కలరా సంపర్కములేని ప్రతివాడును, కలరా సంపర్కముగల వానినెవ్వనిని, తాకకూడదు. అట్టి సంపర్కముగల

మడిగ నుండు మాల వానికి మైలపడిన బ్రాహ్మణు నకును గలపోలిక.

వారు బ్రాహ్మణులయినను వారినిగూడ తాకకూడదు. మైల సంపర్కము లేనివానిని మాలవానిని కూడ నొకానొకప్పుడు తాకినను తాకవచ్చును.

తాకకూడుట, తాకకూడకపోవుట అనునవి బ్రాహ్మణుడా మాలవాడా అనుదానినిబట్టి చూడకూడదు. బ్రాహ్మణుడయిననేమి మాలవాడయిననేమి సూక్ష్మజీవుల సంబాధమయిన సంపర్కము వానికి ఉన్నదా లేదాఅని చూచుకొనవలెను. ఎట్టివారినైనను సంపర్కముచే మైలపడిన వారిని ఊరిబయట పాకలువేయించి యందు కాపురముంచవలెను. ఇందు తప్పేమున్నది?

సర్కారువారికి తోడ్పడవలెను.

ఇట్టి అంటువ్యాధులయొక్క సంపర్కమును సాధ్యమయినంతవరకు లేకుండ చేసికొనుటకే మన వారలు అనుచిగా నుండు మాల మాదిగలను ఊరిబయట వేరుగ నివసింపజేసిరి. ఇట్లే ఇప్పుడు పట్టణములలో సర్కారువారు అంటువ్యాధి సోకిన రోగులను ఊరుబయటపాకలలో నివసింపజేయుచున్నారు. అట్టివాడుక మన ఆరోగ్యము కొరకే యేర్పరుపబడినది. కావున వారికి సంబాధమైన పనులలో ప్రజలందరము సహాయముచేయవలెను.

## జంతువుల సంపర్కముచే గలుగు మైల.

ఒక మనిషి కలరా రోగిని తాకుట చేతనేగాక, ఈగ దోమ మొదలగు ఇతర జంతువులను తాకుటచేకూడ వానికి మైల సోకుచున్నది. ఒక యీగయొక్క జీవితపుకథను మీరువినిన యెడల పైన వ్రాసిన మానవ సంపర్కమునకంటె జంతు సంపర్కము మూలమున నీ సూక్ష్మజీవుల సంబాధమయిన మైల ఎక్కువ భయంకరముగ వ్యాపించుచున్నదని మీకు తెలియగలదు. అల్ప జంతువుల కలన గలుగు తాకుడు మైల.

## ఈగయొక్క అవతారములు.

ఈగలు సామాన్యముగా నొక్కొక్కకాన్పునకు 120 మొదలు 150 వఱకు గ్రుడ్లనొక ముద్దగా బెట్టును. ఈగ్రుడ్లు 2-వ పటములో చూపిన ఆకారము ఈగయొక్క అవతారములు.

2-వ పటము.



ఈగ గ్రుడ్లు.

గలిగి, తెల్లగ నిగనిగలాడుచు, జిగురు జిగురుగా నుండును. ఈగ తనగ్రుడ్లనెప్పుడును పేడకుప్పలు మొదలగు క్రుళ్లు పదార్థములుగల చోట్లబెట్టును. వీలయినప్పుడు మనశరీరముమీది పుండ్లలో గూడ నిది గ్రుడ్లు పెట్టును. కొన్ని ఈగలు చిన్నపిల్లల ము

క్కులలోను చెవులలోకూడ గ్రుడ్లుపెట్టును. ఇవి యిక్కడ వేసవిలో 24 గంటలలోపలను శీతకాలములో రెండుమూడు దినములలోపలను 3-వ పటములో చూపినట్లు 12 కణుపులుగల తెల్లని తోక

3-వ పటము,



ఈగ పురుగు.

పురుగులుగా పరిణమించును. ఈపురుగులు తలవైపున సన్నముగను వెనుక వైపున లావుగను మొద్దుగను ఉండును. ముందువైపున రెండు దట్టమైన పెదవులుగల ముట్టెయుండును. ఈముట్టె మిక్కిలి కఠినమైనదగుటచే నిది చరచర పుండ్లలోపలికి తొలిచి

4-వ పటము,



ఈగ గూడు.



5-వ పటము, ఈగ.

కొని పోగలవు. ఇవి యిట్లు 5 దినములుండిన పిదప 4-వ పటములో చూపినట్లు గూడు కట్టుకొనును. అప్పుడు వీని తెల్లనిచర్మము నలుపెక్కి గట్టిపడి గుల్లగా నేర్పడును. ఈగూటిలోనివి నిరాహారముగా మూడుదినములుండిన తరువాత 5-వ పటములో చూపిన ప్రకారము గూటిని పగుల్చుకొని రెక్కలుగల ఈగెలుగా వెలువడును. ఇట్లు గ్రుడ్డునుండి ఈగ పుట్టుటకు సగటున 10 దినములు పట్టును. ఈ దేశములో సామాన్యముగా సంవత్సరముపొడుగునను యీగలు గ్రుడ్లుపెట్టును, మగ ఈగల కండ్ల సందును దగ్గరగానుండును. ఆడవాని కండ్లనడుము ఎడము హెచ్చుగానుండును.

ఇట్లు సగటున 10 దినములలో తల్లి ఈగనుండి తల్లి యంతపెద్దవియగు 120 పిల్లఈగలు పుట్టునని చూచితిమిగదా! ఈ 120 ఈగలలో సగము మగవి సగము ఆడవిఅని తలచినను, 60 ఆడుఈగలనుండి 60 × 120=7200 పిల్లలు మరి పది దినములలో పుట్టును. ఇట్లు ఒకనెల ముగిసెడులోపలనే ఒకతల్లి ఈగనుండి 4, 32,000 ఈగల సంతానము పుట్టుచున్నది. అయినను ఈలెక్కఅంతగాసరియైనది కాదు. ఏలయన సాధారణముగా మనుష్యులలోవలెనే

ఈగలలో కూడ మగపిల్లలకంటె ఆడుపిల్లలు ఎక్కువగాపుట్టును. ఈలెక్కలన్నియు సరిచూచి ఒకానొక శాస్త్రజ్ఞుడు ఒకఆడఈగకు నెల 1 కి 10 లక్షలకంటె మించినసంఖ్యగల కుటుంబ మేర్పడుచున్నదని వ్రాసియున్నాడు.

ఇట్లభివృద్ధి నొందు ఈగల పటాలములు కలరా మొదలగు సూక్ష్మజీవుల సంబంధమైన మైలను మానవులకు తాకించుటలో ఎంతవరకు తోడ్పడుచున్నవో మీకు తెలియగలదు.

ఆపుచేసిన ఈగలకు నింపి. ఇదిగాక ఈ యీగలగ్రుళ్లు మురిగిన పదార్థములు ఆహారముగా చిక్కనగాని పెరుగనేరవు గదా. పరిశుభ్రముగ నుండు ఇండ్లలోను, గ్రామముల లోను ఇట్టి ఆహారము వానికి కరవగుటచేతనే అవి నాశనమును జెందుచున్నవి. ఊరుచుట్టును మురుగు చుండెడు మందబయళ్లుగల గ్రామములలో ఈ యీగల సంపద ఎక్కువగుటకు కారణమిప్పుడు మీకు తెలియగలదు. బురబురలాడు వీధులు గలిగినట్టియు మురుగుచుండు తోటపంట్లుగల యట్టియు వర్షకాలము ఈయీగల వృద్ధికి ఎందుచేత తగియున్నదో కూడ తెలిసికొనుడు. దినమునకు పదిసార్లు ఆవుపేడ నీళ్లతో శుద్ధిచేసికొను బ్రాహ్మణుల వంట

ఇండ్లలో నియోగులు తక్కినజాతులవారి వంట ఇండ్లలోకంటె నెక్కువగనుండును. ముఖ్యముగా వీరి భోజనపుటిండ్లలో పిదపిదలాడుచుండు తేమ నాశ్రయించుకొని ఈ యీగ లెల్లప్పుడును ముసురుచుండును. మనకంటికి కగపడు నీ యీగలేగాక సూక్ష్మదర్శనిసహాయముచే మాత్రము చూడదగిన యసంఖ్యాకములగు ప్రాణులెన్నియో పుట్టి మురికిని తిని బ్రతుకుచుండును. కావున నీ ఆవుపేడ నీళ్లతో వారు తమ యిండ్లను మైలచేసికొనుచున్నారు. కాని శుద్ధి చేసికొనుట లేదని నేను చెప్పగలను.

జంతుసంపర్కమున గలుగు మైలకు శుద్ధి.

ఊరుచుట్టు నుండు గోతులు.

ఇండ్ల చుట్టును ముసురుచుండు పదార్థములను లేకుండ చేసి కొనుట. గ్రామములకు నలుప్రక్కల నుండు బురదమయములగు బందలు ఆవలు మొదలగువానిని పూడ్చివేయుట. ఇండ్లు కట్టుకొనుటకు సహజముగ ఎత్తయిన ప్రదేశములు ఏర్పరుచుకొనవలెనేగాని ఊరుచుట్టును గోతులుపెట్టి ఆగోతుల నిండ నీరునిలుచునట్లు చేయరాదు. ఇట్టిజాగ్రత్తల చే ప్రజల ఆరోగ్యము హెచ్చును. ఈగలుదోమలు మొదలగు అల్పజంతువుల వృద్ధితగ్గును. ఈ రెంటిమూలమునను కూడ అంటు వ్యాధుల వ్యాప్తి క్షీణించును.

## 2. నీటిమైలకు శుద్ధి.

చల్లచుక్క వేసి నీటిని శుద్ధి జేయుట.

ఏ నీటియందైనను కలరాసూక్ష్మజీవులు ప్రవేశించినయెడల అట్టి నీరు మైల పడినదగుచున్నది. శూద్రులఇండ్లలో బ్రాహ్మణులు మంచినీళ్ళు త్రాగవలసి వచ్చినయెడల అట్టినీటిని బ్రాహ్మణున కిచ్చుటకు పూర్వము దానిలో కొంచెము చల్లచుక్క వేసి శుద్ధి చేయుదురు. అట్టి శుద్ధివలన నేమిప్రయోజనమో మనకు తెలియదుగాని కలరాసూక్ష్మజీవులు గల నీళ్లను ఎట్లు శుద్ధిచేయవలెనో అట్టిశుద్ధివలన ఏమిప్రయోజనమో తెలిసికొనుట సులభము. ఇట్లు శుద్ధి చేయుటకు అనేకమార్గములుకలవు.

1. కలరావల్ల మైలపడిననీళ్లలో కొన్నిమందులు వేసి సూక్ష్మజీవులను చంపుట.

2. మైలపడిన నీటిని మరిగించి అందుండు సూక్ష్మజీవులనుచంపుట.

3. సూక్ష్మజీవులుగల నీళ్లను వడపోసి శుద్ధి అయిన నీటిని వేరుగాను సూక్ష్మజీవులను వేరుగాను విడదీయుట. అట్లు విడదీయు వడపోతలనుగూర్చి ఆరోగ్యశాస్త్రములో చదువగలరు. కుండలు ఇసుక బొగ్గులు మొదలగునవి ఇందు సాధనములుగా నుపయోగింపబడును.

1. మైలపడిననీటిని మందులచే శుద్ధిచేయుట. మందులచే నీటిని శుద్ధి చేయుట

౧. పొటాశియం పర్మాంగనేటు అనుమందును మైలపడిననీళ్లలో 1000 పాళ్లకు 5 పాళ్ళు చొప్పున వేసి ఆనీటిని ఒకపూటనిలవయుంచిన ఆనీరుశుద్ధియగును.

ఇట్టి పద్ధతిని మైలపడిన నూతులను బాగు చేయుటకు ఉపయోగింతురు.

మైలపడిన నూతులు విభూతి తీర్థము, గోమయము, పసుపునీళ్ళు మొదలగువానివలన ఎంతమాత్రమును శుద్ధికానేరవని యెరుంగునది.

2 బురదగల నీళ్లలో సూక్ష్మజీవులున్న యెడల అందు ఇందుపకాయగంధము, పటికిపొడుము మొదలగునవి కలిపిన అట్టిబురద సూక్ష్మజీవులతో పాటు బిందె అడుగునకు దిగును. అడుగుభాగముననున్న నీరు సూక్ష్మజీవులమయమై యున్నందున మైలగానే యుండును. ఇందుపకాయగంధము; పటికపొడుము.

2. నీటిని మరిగించి అందుండు సూక్ష్మజీవులను చంపుట. నీటినిమరిగించి శుద్ధి చేయుట.

ఈ విధానము మిక్కిలి సులభ మయినది. ఎక్కడున్నను ఏవేళయందును, ఏమందు అక్కరలేకనే చేసికొనవచ్చును. ప్రాణమునందు ఆశఉన్నవారందరును కలరానుండి తప్పించు కొనవలెనని

మరిగిచల్లారిన నీటినిత్రాగిన చాలును. వారి కీది అభయహస్త మిచ్చెను.

ఇంకొకమాట. కలరాసూక్ష్మజీవులకు విషము లైన మందులను వేనినైన నీటిలోవేసి శుద్ధిచేయవలె నని మనముప్రయత్నించునప్పుడు అట్టినీటియందు మనము కలుపు విషములు మనదేహమునకు గూడ కొంతవరకైనను విషములుగా నుండవచ్చును. కావున అట్టినీటిని శుద్ధిచేయు విధములన్నిటిలోను దానిని చక్కగ మరిగించుటయే మంచిది.

నీటిని వడపోసి శుద్ధిచేయుట.

ఎంతపరిశుభ్రమైన గుడ్డతో ఎన్నిమడతలువేసి వడపోసినను కలరా సూక్ష్మజీవులుగల నీటిని మనము వడపోతవలన శుద్ధిచేయలేము. ఎంతసన్నని సందులున్నను హానిగుండ కోట్లకొలది సూక్ష్మజీవులు అవలీలగ దూరిపోగలవు. వాని పరిమాణము అంగుళములో 48000 - వ వంతేగదా! కావున నీ సూక్ష్మజీవులను తొలగించురీతిని వడపోయవలెననిన దానికి ప్రత్యేకమైనసాధనములు కావలెను. మనము సాధారణముగా చేయునట్లు గుడ్డతో వడపోసి యానీరు శుద్ధిమైనదని భ్రమపడకూడదు. కంటికి నిర్మలముగా కనబడు నీరుఅంతయు శుద్ధిఅయిననీరుకాదు. ప్రక్కపుటలోని వడపోతయంత్రములనుచూడుము.



6. వ పటము.

నీరు వడపోయు యంత్రము యొక్క ఆకారము 6-వ పటములో చూపబడినది. కలరా మొదలగు అంటువ్యాధి గల ప్రదేశములలో నివసించువారెల్లప్పుడును నీటి నిట్టియంత్రములతో వడపోసి కొనిగాని చక్కగ పొంగ కాచిగాని త్రాగవలెను.


7. వ పటము.

నీరు వడపోయు యంత్రములోని నిర్మాణము 7-వ పటములో చూపబడినది. 1. మూత. 2. నీరు పోయు స్థలము 3. ఈ నీటిని వడపోయు గొట్టము, దీనిలో మిక్కిలి సన్నని రంధ్రములుండును. ఈ రంధ్రములగుండ పరిశుభ్రమైన నీరు క్రిందికిదిగి కల్మషము పై పాత్రములో మిగిలిపోవును. 4. నిర్మలమైన నీరు చేరెడి భాగము. 5. నిర్మలమైన నీటిని తీసికొను కొళ్లాయి.

నీటిమైల పడకుండ చేయు టెట్లు?

గోటితో చిదుమతగిన దానిని గొడ్డటితో కొట్టనేల ? నీటిని మైలపడకుండ చేసికొనుట సులభమయిన మార్గము లుండగా పరిశుభ్రమయిన నీటినేల మైలపర్చవలెను? మైలపర్చిన నీటిని తిరిగి శుద్ధిచేసికొనుట కేల కష్టపడవలెను? అడుసుత్రొక్క నేల, కాలు కడుగ నేల?

కావున నీటిని మైలపడకుండ చేసికొనుటకు ఎయ్యవి సాధనములో తెలిసికొనవలెను.

బిందెడు మడినీళ్లలో మైల నీటి చినుకొకటిపడిన యెడల బిందెడు నీళ్ళును మైలపడిపోవుననుట మన మందర మెరిగిన సంగతియే. ఏలయనగా తగిన ఆహారము చిక్కినచో ఒక్కొక్కకలరా సూక్ష్మజీవి 24 గంటలలోపల అనేకలక్షల సూక్ష్మజీవులుగా వృద్ధిచెందునని మొదటి ప్రకరణములో చదివియున్నారు. కావున మీకు వేరుసమాధానము చెప్ప నక్కరలేదు.

బిందెలోనీళ్లలో రవంత మైలగలిసిన యెడల గలుగు అపాయమును చూచితిమి. కాని మనవారలు బిందెయొక్క వెలుపలివైపున మైల నీటిబిందువొక్కటి పడినప్పుడును కూడ బిందెలోని నీరు మయిలపడినట్లు ఎంచుచున్నారు. ఇదిగాక మాల

వాని యొక్కగాని, బహిష్టుఅయిన బ్రాహ్మణస్త్రీల యొక్కగాని వాసన బిందెకు కొన్ని గజములదూరములో తగిలినను ఆ బిందెలోని నీటిని కొందరు మైలపడినట్లు ఎంచుదురు.

మనవారలలో కొందరు ఎంతజాగ్రత్తగా నుందురో చూతుము.

ఒకరు త్రాగెడు చెంబుతో మరియొకరికి నీరు త్రాగనీయకూడ దందురు. మరియొకరు త్రాగిన యెడల వారియందు దేనైనమైలయున్నచో, ఆమైలయా చెంబుద్వారా తమకు వ్యాపించునేమో అను భయము చేతనేకదా? ఇదిమంచిఆచారము. ఇట్టి మయిల తమకు తాకునేమో అని భయము కలిగి నప్పుడు, నీరుత్రాగెడువానిని చేయిపట్టుమని చెప్పి, తమచేతిలోని చెంబుపైకియెత్తి నీటిని ధారగా పోయుదురు. యిట్టి మయిల యేదియును తమను తాకకుండ ప్రతివారును ఎంతజాగ్రత్త పుచ్చుకొనినను తప్పలేదు.

చెంబు ద్వారా మయిల అంటును.

ఇంతటిమడి మయిలలజ్ఞానముగల హిందువులు మనచెరువులలోని నీటిని మయిల పర్చరాదు. కలరాయొక్క సంపర్కముచే మయిలపడినరోగి, తన మయిలను చెరువులలోన కలిపిన అనేకము

నీటిని మయిల పఱచిన వారికి ఆత్మహత్యానర హత్యాదోషము లువచ్చును.

లయిన నరహత్యలు చేసిన పాపమునకు పాలగు చున్నారు.

కలరారోగి సంబంధమయిన మయిలను వారి బంధువులు స్నేహితులు నౌకర్లు మొదలగువారు, బట్టల మూలముగాని మలమూత్రాదుల వలనగాని, తాకుటవలనగాని సర్వజనోపయోగమగు జలాధారములలో కలిపినయెడల ఆత్మహత్య నరహత్య పాపములను కట్టుకొందురు. ఏలయన తాముచేసిన తప్పుపని వలన తమకును తమగ్రామములలో నితరులకును కలరాతగిలి మరణము సంభవింపవచ్చును.

చేదలు, బట్టలు; వీనివలనగలుగు మయిల.

తమచేదల ద్వారాగాని బట్టలద్వారాగాని నూతులలో నిట్టి మయిలజేర్చక, నీరు తోడుకొనుటకు శుద్ధిచేసిన చేదలను ఉపయోగించుచు, శుద్ధిచేసికొనిన మనుష్యులచే తోడించుకొనవలెను. మయిలపడిన వార్లందరును, మయిలపడిన చేదలతో మడి మయిల అను జ్ఞానములేనివారై నూతులను ఉపయోగించినచో అట్టినూతులు నిమిషములో మయిలపడి విషపాత్రములతో తుల్యమగును.

పశువులు; పందులు మొదలగువానివలనగలుగు మయిల.

కావున గ్రామమునందలి చెరువులను నూతులను, బహుజాగ్రత్తతో ప్రతిగ్రామస్థుడును కాపాడుచు, తమవలనగాని, తమయొక్క పశువులు, పం

దులు, కుక్కలు, కోళ్ళు, బాతులు మొదలైన వాని వలనగాని, నీటికి మయిలయొక్క సంపర్కము కలుగ కుండ చూడవలెను.

చెన్నపట్టణమునకు నీరునిచ్చు చెరువు పట్టణమునకు 12 మైళ్ళ దూరములో నున్నది. ఇట్టి సంపర్కమేమియు లేకుండ దాని నెల్లప్పుడును కాపాడుచుందురు. కావుననే ఈ చెరువు నీటిని త్రాగుట ప్రారంభించిన తరువాత ఈ పట్టణములో కలరా అనునదే మిక్కిలి అరుదయ్యెను. ఎక్కడనో ఇతర గ్రామములనుండి వచ్చినవారయిన ఒకరిద్దరు రోగులు తప్ప, కలరాచే నీ పట్టణమునందలి జనులు మృతినొందుటయే లేదు. దీని కంతకును ఈ నీటియందు కలరా మయిల లేక పోవుటయే కారణము. చెన్నపట్టణములో కలరా.

3. మయిల పడిన గాలికి శుద్ధి.

10 సంవత్సరములకు పూర్వము గాలి మూలము కలరా వ్యాపించు నను నమ్మకము హెచ్చుగ నుండెను. కలరావలన గాలి మయిల పడినదని తలచి, అట్టిగాలిని శుద్ధిచేయు నిమిత్తమై, సర్కారువారు కలరా రోజులలో వీధులలో తారును కాల్చి పొగ వేయుచుండెడివారు. ఇప్పుడది యనవసర మని విడిచివేసిరి. ఒకవేళ వీధులలోనిగాలి మయిల పడినను మైలపడిన గాలికిశుద్ధి

దానిని వాయుదేవుడే చక్కని గాలి పంపించి శుద్ధిచేయవలెను గాని, మనము వేయు తారుపొగలచే శుద్ధికానేరదు. ఇండ్లలోనిగాలి కలరాచే మయిలపడిన యెడల గంధకము, తారు, హారతి కర్పూరము, గుగ్గిలము, మొదలగునవి కాల్చి వానిపొగను ఇంటినిండ వ్యాపింపజేసి మయిలగాలిని గొంతవరకు శుద్ధిచేయవచ్చును. ఇందుకు రెండు అభ్యంతరములుగలవు.

ఇండ్లలోగంధకము మొదలగునవి పొగవేయుట.

1. ఈ పొగను ఇంటినిండ వ్యాపింపజేయవలెనని న సందులు లేకుండ తలుపులు మొదలగు వానిని చక్కగ మూసివేయవలెను. అట్లు మూసినను మన దేశమందలి పెంకుటిండ్లయొక్కయు తాటాకు ఇండ్లయొక్కయు పైకప్పులయం దుండుసందులగుండ ఈ పొగ దూరిపోవును. కావున ఇట్టి పొగమూలమున గాలిని శుద్ధిచేయుటకు మన ఇండ్లంతగా తగియుండలేదు.

2. సూక్ష్మజీవులను చంపుటకు శక్తిగల యీ పొగ, మన ఆరోగ్యమునకుగూడ అపాయకరముగా నుండవచ్చును. కావున ఇట్టిపొగను ఇంటినిండ వ్యాపింపజేయునప్పుడు ఎవ్వరును ఇంటిలో నుండకూడదు. పిమ్మట తగినకాలమువరకు తలుపులు మొదలగునవి తెరచిపెట్టి, పొగ అంతయును ఇంటిలోనుండి

పోయినతరువాత, మన మాఇంటిలోనికి పోవలెను. లేనిచో అపాయము కలుగవచ్చును.

గాలిని మయిలపడకుండ చేయుట క్రింది అంశములు మిక్కిలి ముఖ్యమైనవి. గాలిని మయిల పడకుండ చేయుటెట్లు?

1. జనసమ్మర్దము లేకుండుటకుగాను ఇండ్లను దూరదూరముగా కట్టుకొని, ఇంటింటికిని సాధ్యమునతగినంత ఖాళీస్థలమును విడిచిపెట్టి తోటలను పెంచుకొనుట.

2. ఊరియందు నివసించు పశువులు మొదలగు జంతువులకు విరివియైన కట్టడములను ఊరికి దూరముగా కట్టుకొనుట. అవి ఊరిలో నుండక తప్పనిచో అట్టిస్థలములను ఎప్పటికప్పుడు శుభ్రము చేసికొనుట. అట్టికట్టడములలో గాలి చక్కగా ప్రవేశించుటకై పెద్దపెద్దకిటికీలను పెట్టుకొనుట.

3. మురుగుదొడ్లను జలదారులను తరుచుగా శుభ్రము చేయించుకొనుట.

4. ఊరిమధ్యను చుట్టుప్రక్కలనుండు కొలుములు, గోతులు, పంటకాలువలు, బందము మొదలగు వానిలో కుళ్ళునీరు నిలవకుండ జేసికొనుట.

ఈపై జెప్పిన దానివలన గాలిని మయిలపడకుండ చేసికొనుటకు కొంతవరకు సాధ్యమగును.

---

# మూడవ ప్రకరణము

## కలరావ్యాధియొక్క గుణములు.

కలరా వ్యాధి యొక్క గుణములు.

సూక్ష్మజీవులు కడుపులో ప్రవేశించినదిమొదలు వ్యాధిగుణములు కనబడు వరకు ఎన్నిదినములు పట్టునో నిశ్చయముగా జెప్పుటకు వీలులేదు. రెండు దినములు మొదలు అయిదుదినములలోగా బహుశః వ్యాధి పరిణమించును. అయినను అక్కడక్కడ దీని పరిణామకాలము రెండు రోజులకంటె తక్కువగా నుండుటయు అయిదు రోజులకుమించి రెండు వారములవరకు వ్యాధి పరిణమింపకుండుటయు గూడ అరుదుగ గలదు.

కలరాయొక్క గుణములు కొందరు రోగులలో నొకవిధముగను, మరికొందరియందు వేరొకవిధముగను ఉండవచ్చును. అనగా కొందరి కది మిక్కిలి యకస్మాత్తుగ తనచిహ్నములజూపును. మరికొందరి కీవ్యాధి సోకినతరువాత మున్ముందుగా రెండు మూడు దినములవరకు నీరసము, ఏదోయొక విధమున జబ్బుగా నున్నట్లుతోచుట, తలతిరుగుట, చెవులలోధ్వనులు, బొడ్డుపై భాగమున కడుపులో నొప్పి

మొదలగు నీ చిహ్నములతో ప్రారంభించును. ఒకానొకప్పుడు సామాన్యమైన అజీర్తి విరేచనములతో ప్రారంభింపవచ్చును. అట్టి చిహ్నములనుబట్టి కలరా వ్యాధియొక్క కాలమును మూడుదశలుగ విభజింపవచ్చును.

1. ఆరంభదశ.
2. వాతపుదశ.
3. ఉష్ణదశ.

1. ఆరంభదశ :—ఈదశలో పైనిజెప్పిన ప్రకారము అకస్మాత్తుగగాని, కొన్ని ఇతర చిహ్నములతో కూడిగాని విరేచనములు ప్రారంభించును. సామాన్యముగా కడుపులోనొప్పి, విరేచనము పల్చగనుండుట, ఒక్కొక్కప్పుడు వాంతులు, తలనొప్పి, విచారకరముగా నుండుట, ఇవి మొదట ఒకటి రెండు రోజులవరకు నుండును. ఆరంభదశ.

2. వాతపుదశ :—ఈదశయందు భయంకరములైన విరేచనములు ముఖ్యమైన గుణము. ఆరంభదశలో విరేచనములు కొద్దిగనున్న యెడల అవి యిప్పుడు హెచ్చగును. లేనియెడల ఇప్పుడు ప్రారంభించును. విరేచనముయొక్క మామూలురంగు నశించిపోయి, అది గంజినీళ్లవలె ఖిక్కిలి పలుచగను, వాతపుదశ; విరేచనములు.

తెల్లగను ఉండును. ఈవిరేచనములు చప్పగగాని, కొంచెము ఉప్పగగాని ఉండునని వ్రాసియున్నారు. ఇందు కొన్ని లవణములును శ్వేతధాతువు (Albumin) ను ఉండును. కడుగువలె మిక్కిలి తేలిక గానుండు నీ విరేచనములను నిలువయుంచి పరీక్షించినయెడల దీని అడుగునకు సన్నని ఇసుక నలుసులవలె నుండు కొంచెము కందునవర్ణముగల విరుగుడు చేరుచుండును. ఈ విరుగుడునందు రక్తమునందలి తెల్లకణములును, కంది యెరు పెక్కిన పేగులయందలి పైపొరలముక్కలును, అనేకములైన సూక్ష్మజీవులును, కన్పట్టును. ఒకానొకప్పుడు పేగులు పుండుపడి వానినుండి స్రవించెడునెత్తురుతో కలియుటచేత విరేచనము కొంచెము ఎరుపెక్కి యుండినను యుండవచ్చును. విరేచనములు మిక్కిలి పలుచగనుండి కడవలతో దిమ్మరించినట్లును, చిమ్మెటి గొట్టములతో చిమ్మినట్లును, ఉండును. విరేచనము లగునప్పుడు కడుపులో బొళ బొళ మనియు గురు గురు మనియు ధ్వనులు గలిగి యుండును. సామాన్యముగా కడుపు బిగబట్టినట్లు నొప్పులుగాని పొర్లి పొర్లి వచ్చు నొప్పులుగాని ఉండవు. అరుదుగ నుండుటయు గలదు. సామాన్యముగా విరేచన

ములు ప్రారంభించినతోడనే బహునీరసముగనుండి మనిషిని పడగొట్టును. తత్క్షణమే కాలు చేతులు చలువలు గ్రమ్మవచ్చును. ఊపిరి చిక్కబడి దాహ మధిక మగును. నాలిక తెల్లబారును. కాలుచేతు లీడ్చుకొనిపోవును.

విరేచనములు ప్రారంభించిన ఒకటిరెండు గంట వాంతులు. లలోగా వాంతులు ప్రారంభమై ఒకవాంతిమీఁద మరియొకటి తరుముకొనివచ్చినట్లుగా నగును. వాం తిలో మొదట అరగీఅరగని అన్నము వెలువడును. పిమ్మట విరిగిన పాలలోని నీళ్లవలె నుండును. తరు వాత విరేచనముయొక్క కడుగువంటిరంగే వాంతు లకును గలుగును. వాంతి అగుటకు పూర్వము సాధా రణముగా నధికమైన వికారము ముండదు. వాంతి అగు టకును మిక్కిలి కష్టపెట్టదు. ఊరకే దిమ్మరించు నట్లుగా పెద్దపెద్దవాంతులు మడుగులు గట్టినట్లగును. వీనితోపాటు నిస్సత్తువ అధికమై కాలుచేతులలో నెప్పులుహెచ్చి కొంకర్లుపోవును. కండలన్నియు కొయ్యలవలె నిగుడుకొనును. రోగి. యిట్టి దశ లో గిజగిజ తన్నుకొనుచు ఇటునటు దొర్లాడును. చేతులను ఈవైపునుండి ఆవైపునకును ఆవైపునుండి ఈవైపునకును విసరికొట్టుచు బహు ఆయాసముతో

మిక్కిలి విసుగుతో అతి దాహముతో ఎదురు రొమ్ము మంటతో కాళ్ల ఈడ్పులతో నలిగిపోవును. అంతట కాళ్ళుచేతులు చలువలుగ్రమ్మి రోగి మూర్ఛిల్లినట్లు పడిపోవచ్చును.

శరీరము లోని నీరు హరించి పోవును.

విరేచనముల మూలమునను, వాంతుల మూలమునను, శరీరమునందలి నీరంతయు వెడలిపోవుటచేత ముఖము మొదలగు మెత్తనిభాగము లన్నియు వాడి ముడతలు పడును. చెక్కిళ్లు దించుకొని పోవును. ముక్కు సన్నగించి వదలిన ట్లుండును. కండ్లు గుంటలుపడును. వ్రేళ్ళుచాకలవాని వ్రేళ్లవలె నీటిలో నానినట్లు ముడుచుకొని పోవును. శరీరము కాంతివిహీనమై నలుపారి చల్లని చెమటతో కప్పియుండును. గొంతుక బొంగురుపోవును. మూత్రము హరించిపోవును.

గొంతుక బొంగురుపోవును: నాడిసన్నగించును.

ఉచ్ఛ్వాసనిశ్వాసముల వేగ మధిక మగును. ఊపిరివిడుచుటకు అతి ఆయాసముగ నుండును. ఊపిరి గాలి మిక్కిలి చల్లబడును. క్రమముగా గొంతుక యొక్క బొంగురు హెచ్చి, రహస్యపుమాటల వలె దిగును. నాడి సన్నగించి నీరసముగ, అతివేగముగ, పరుగెత్తుచుండును. పిమ్మట కొంతకాలము వరకు నాడివచ్చుచుపోవుచుండును. మినుకుమినుకు మనుచు

కనుపట్టుచు తుదకు బొత్తిగ నగుపడకుండ నుండ వచ్చును. శరీరవేడిమి వేగముగ ననేకడిగ్రీలుతగ్గిపోవు ను. 93 లేక 94 డిగ్రీలవరకును పడిపోవచ్చును. చంక లోనున్న వేడిమికంటె నోటిలోని వేడిమి ఇంకను నాలుగైదు డిగ్రీలు తక్కువగ నుండుటయు గలదు. ఇట్టి సమయములయందుకూడ ఆసనమునందలి వేడిమియు, శరీరములోపలనుండెడు ఇతర అవయవముల వేడిమియు, క్రమక్రమముగ నధికమై సామాన్యముగ 101 మొదలు 105 డిగ్రీలవరకు హెచ్చును. శరీర వేడిమి తగ్గుట.

ష రా:— సామాన్యముగా మానవశరీరముల వేడిమి ఫారన్‌హీటు ధర్మామీటరు * అనుగాజు కొలతపుల్లతో పరీక్షించిచూచిన 98½ డిగ్రీలుండును. ఈకొలతపుల్లకు మనశరీరవేడిమి చక్కగ అంటుటకై కొన్ని నిమిషములు ఆపుల్లను చంకలోగాని, నోటిలో నాలుకక్రిందగాని ఉంచి పరీక్షించుదురు. చంకలో వేడిమికంటె సామాన్యముగా నోటివేడిమియు, ఆసనవేడిమియు, ఒకడిగ్రీకి మించకుండ అధికముగ నుండును; అనగా 99 డిగ్రీలు ఉండవచ్చును.

---

* దీనిని తెలుగులో ఉష్ణతామాపకము అందురు. దీని నిర్మాణమునుగూర్చి పదార్థవిజ్ఞానశాస్త్రమునందున 195 పుట చూడుము. (రెండవకూర్పు).

మూత్రము హరించును. ఈ వాతపుదశలో కొంతసేపటికి విరేచనములు కట్టునుగాని వాంతు లెప్పటివలెనే యుండును. మూత్రము క్రమక్రమముగ తగ్గి తుదకు మొదలంట హరించిపోవును. ఈదశయందు రోగి వెక్కిలి విసుగుదల గలిగి యుండి మాట్లాడుట కిష్టములేనివాడైనను మనస్సు నిర్మలముగానే యుండును. కలరా గుణములు ప్రారంభించిన తరువాత ఈదశ అయిదారు గంటలలోగా ప్రారంభించి పండ్రెండు గంటలు మొదలు ఇరువదినాలుగు గంటలవరకును విశేషకయుండ వచ్చును. సామాన్యముగా ఈదశ

మనోనిర్మలత్వము. నుండి తెప్పరిల్లకయే క్రమముగా స్పృహదప్పి యొకానొకప్పుడు సంధించిపరాకు మాటలలోదింపి రోగిమృతినొందుట గలదు. ఒకానొకప్పుడు ఆరంభదశలేకయే వ్యాధి ప్రారంభించుటలోనే వాతపుదశ ప్రారంభించి విరేచనము లధికముగ కాకమునుపే ఒడలు చలువలు గ్రమ్మి క్రుంగిపోవుటయు గలదు.

ఉష్ణదశ; జ్వరము. 3. ఉష్ణదశ:—వాతపుదశలో దిగినతరువాత పది పండ్రెండు గంటలలో రోగి మృతినొందనియెడల క్రమముగా వాంతులు విరేచనములును, సంఖ్యయందును, పరిమాణమునందును తగ్గును. చేతియందు

నాడి తిరిగి యాడుటకు ప్రారంభించును. శరీరము నందుండు వేడిమి కొద్దిగ వెలుపలకు స్ఫురించును. ఈ చిహ్నము చూచిన తోడనే మనము రోగిని గూర్చి ధైర్యము బూనవచ్చును. ఇట్టి రోగులయందు ఇంతకు పూర్వము హరించిన మూత్రము కొన్ని గంటలకు తిరిగి స్రవించి రోగిని అపాయమునుండి తప్పించును. ఇట్టివారలు కొద్దిరోజులలోనే శరీర బలమును తిరిగి సంపాదించుకొందురు.

ఇట్లు గాక ఒకానొకప్పుడు శరీరము వెచ్చబడి, నాడి స్ఫుటపడి ముఖవైఖరి బాగుపడి, విసుగుదలమాని, మూత్రము స్ఫురించి, విరేచనములు హరించి, జీర్ణరసము లుద్భవించునట్టి సమయములో ఉష్ణము మరింత అధికమై జ్వరము అంకురించును. కొద్ది జ్వరమైన యెడల కొన్ని ఘడియలలోనే దిగిపోవును. లేనిచో సామాన్యముగా నాలుగైదు రోజులును, అరుదుగ పదునైదు రోజులవరకును ఈ జ్వరము బాధింపవచ్చును. ఇప్పుడు విరేచనములు కొంచెము పసరెక్కి చెడువాసనగ నుండును. మూత్రము రెండురోజులు మొదలు ఆరు రోజులవరకు ఒక్కొకప్పుడు రాకయుండును. మొదట నది వచ్చునప్పుడు కొద్దిగను, ఎఱ్ఱగను, మలి

నముగను శ్వేతధాతువు గలదిగను ఉండును. క్రమ ముగ నధికమై తెల్లనైన దగును. మొదట మూ త్రమునందు లవణాదులు మిక్కిలి తక్కువగ నున్న ను క్రమముగ కొన్నిరోజుల వరకును ఇవి మూ త్రమునందు మామూలుకంటె నెక్కువగ నుండ వచ్చును.



## నాలుగవ ప్రకరణము

# చికిత్స

ఫలానా ఔషధము కలరావ్యాధికి నిశ్చయమైనమందు అనిచెప్పుటకు వీలులేదు.

చలిజ్వరమునకు క్వొయినా మందు అనియు మలబద్ధమునకు ఆముదము మందు అనియు నిర్ధారణగా చెప్పినట్లు కలరావ్యాధికి ఫలానా ఔషధము తగిన మందు అని నిశ్చయముగా చెప్పుటకు వీలు లేదు. ఏ యే మందులు కలరాసూక్ష్మజీవులను తప్పక చంపగలవో ఆమందులు కలరావ్యాధికి తగినమందు లని చెప్పనగును. మనశరీరములో ప్రవేశించిన కలరాసూక్ష్మజీవుల నెల్ల చంపి వ్యాధిని కుదుర్చు మందు లెవ్వియు ప్రస్తుతము మనకు నిశ్చయముగా తెలియవు.

కాని ఈ సూక్ష్మజీవులవలన పుట్టువిషములు మన శరీరమునందు వ్యాపించి మనకు హానికలుగచేయుచున్న సమయములో అట్టివిషములకు విరుగుడుగా నుపయోగించుమందు లెవ్వియయినను మనకు తెలిసినచో అట్టివాని నుపయోగించి మనపేగులలో నీ సూక్ష్మజీవు లున్నను వానిని మనము లెక్కచేయక యుండవచ్చును. అట్టివిరుగుడు మందులుకూడ ఇంత

వరకు మన కెవ్విరియును నిర్ధారణగా తెలియదు. *

కలరారాకుండ టీకాలు వేయుట.

మశూచికమునకు విరుగుడుగా నుపయోగించు నుద్దేశ్యముతో టీకాలు వేయుచున్నారు. ఈ టీకాలువేయుటకు ఉపయోగించు రసము మశూచికపు సూక్ష్మజీవులవిషములనుండి పుట్టినది. టీకాలువేయుటవలన ఈవిషము మనశరీరములో కొద్దికొద్దిగా ప్రవేశపెట్టబడి అట్టి విషమునకు మనశరీరము క్రమక్రమముగా నలవాటుపడును. అలవాటుపడినమీదట ఎట్టివిషమైనను సామాన్యముగా మనకుహానికలుగచేయదు. టీకాలమూలమున మశూచికపు విషమునకలవాటుపడిన వారి శరీరమునందు, మశూచికపు సూక్ష్మజీవులు ప్రవేశించినను వారిశరీరములో నా సూక్ష్మజీవులతీవ్రము తగ్గిపోయి మశూచికము అంతగా వచ్చుటలేదు.

ఈప్రకారము కలరా సూక్ష్మజీవులకుకూడ విరుగుడులను తయారుచేయుటకు వైద్యులనేకులుప్రయత్నించిరి. ఇప్పుడును ప్రయత్నించు చున్నారు గాని ఇంతవర కెవ్వరును పూర్ణముగా జయము నొందినట్లు చెప్పజాలము.

---

*ఆంధ్రవిజ్ఞానసర్వస్వములో(The Telugu Encyclopedia) అంటువ్యాధులు 204-223 పుటలు చూడుము.

1. వ్యాధియొక్క కారణమును బట్టిచూడగా సూక్ష్మజీవులను కలరా సూక్ష్మజీవులుపేగులలో నున్నప్పుడు వానిని చంపుటకు ప్రయత్నించుట ముఖ్యమైన పనిగా తోఁచును. ఇందునిమిత్తమై శాలాలు (Salol) 5 మొదలు 15 గ్రెయినులు, లేక గ్వాయికాలు కార్బనేటు మొదలు 10 గ్రెయినులులేక హారతికర్పూరం 2 మొదలు 5 గ్రెయినులు మొదలగునవి కొందరిచ్చెదరు.

సూక్ష్మజీవులను నశింపుచేయుటకై చేయు చికిత్స.

*కొందరు ప్రథమదశయందు వచ్చినరోగికి జాడించి ఒకటిరెండు విరేచనము లగునట్లు ఒకపలం ఆముదముగాని, అరపలంమొదలు ఒకపలమువరకు మగ్నగంధకితము (Magnesium Sulphate) అను ఉప్పును గుప్పెక్కుడు నీళ్లతోచేర్చి దానినిగాని, మొట్టమొదట నిచ్చి విరేచనమైన తరువాత రసభస్మము (Calomel) గ్రెయినులో6-వ వంతుచొప్పున గంట గంటకు ఇచ్చుచు వచ్చెదరు.

కొందరీ రసభస్మమునే మొదట 5 గ్రెయినుల

* నేనుసామాన్యము గారసభస్మము (Calomel) గ్రెయినులో ఆరవవంతును కస్తూరిగ్రెయినులో సగమును,హారతి కర్పూరము ఒకగ్రెయినును కలసినమాత్రలను గంట కొక్కటి చొప్పున ఇచ్చెదను. ఈమాత్రలుప్రారంభదశలో మిక్కిలిఉపయోగకరముగా కానుపించుచున్నవి.

మోతాదుల కొకటి నిచ్చి తరువాత 3 గ్రెయినుల మోతాదులను 6 గంటల కొకటి చొప్పున ఇచ్చుట మంచిదని వ్రాయుచున్నారు.

కాని రసభస్మము హెచ్చు మోతాదులుగా నుపయోగించుటవలన ప్రయోజన మంతగా కానరాదు. సూక్ష్మజీవులను చంపుటకు మాత్రమే ఉద్దేశించి ఇచ్చినయెడల గంట గంటకు గ్రెయినులో 6-వ వంతు మోతాదుల చొప్పున ఇచ్చుటయే మంచిది.

వేడిగనుండు వగరు పదార్థములను 2 గంటల కొకసారి పేగులలోనికి ఆసన మార్గమున పిచికారీ చేసిన మంచిది. సలసలకాగి చల్లారిన నీళ్లలో వేయింటికి 5 పాళ్లు టానిక్ ఆసిడ్డును, నల్లమందు అరకు 5 పాళ్లును తుమ్మజిగురు 30 పాలును చేర్చి కలిపి ఆ ద్రావకమును గోరువెచ్చగా నుండునట్లుగా మెల్ల మెల్లగా పేగులలోనికి ఆసనమార్గమున నెక్కింపవలెను. ఈ టానిక్ ఆసిడ్డు కలరా సూక్ష్మజీవులకు బలవద్విరోధియగుటచే వానినక్కడ నశింపుచేయుననియు అందుచే ఈప్రయోగము మిక్కిలిఉపయోగకర మనియు ఒకరు వ్రాయుచున్నారు.

సూక్ష్మజీవులను నశింపుజేయు నుద్దేశముతో ఇవి

గాక మరికొన్ని ఔషధములు ప్రస్తుతము తరుచుగ వాడుకలో నున్నవి.

1. పొటాసియము పర్మాంగనేటుఅనుమందును నలుసంతముక్కను అర్ధశేరు నీళ్లలో వేసిన యెడల ఆ నీళ్లుయెర్రచంద్రకాంత పువ్వువంటి ఒక విధమైన చక్కని మెరుపు వర్ణము (Pink) గల వగును. ఆ నీళ్లలో కల్మష మేమయిన నున్నయెడల అట్టి కల్మషమును ఈ మందు తినివేయును. ఆ నీళ్లలోనికల్మషము హెచ్చుగ నున్నయెడల ఈ మెరుపు వర్ణము మారి మలినమైన వర్ణమగును. కల్మషము బొత్తిగ లేని యెడల మెరుపు రంగు ఎప్పటికిని అట్లే యుండును. ఈ మందునే నూతులలోని కలరా సూక్ష్మజీవులను చంపి నీటిని శుభ్రపరచుటకు ఉపయోగింతురు. పరిశుభ్రమైన నీటిలో పొటాసియము పెర్మాంగనేటును శేరునీటిని రెండు గురిగింజలెత్తు చొప్పున వేసి (4000మొదలు 8000లకు 1 పాలు చొ) కలిపి ఆ నీళ్లను రోగికి మాటిమాటికి త్రాగుట కిచ్చిన యెడల, ఆ నీరు కడుపులోనికి పోయినప్పుడు అక్కడి కలరా సూక్ష్మజీవులను చంపునని కొందరి అభిప్రాయము. ఒకవేళ ఈ నీళ్లు వాంతియై పోవుచుండినను నష్టము లేదు. ఈ మందునీళ్లు కడుపులోనికి పోయి

పొటాసియం పర్మాంగనేటు తో చికిత్స.

లోపలి భాగములను కడిగి శుభ్రముచేసికొని తిరిగి వచ్చుచుండుటచేత కొంత గుణముకలదు.

ఈ పొటాసియము పర్మాంగనేటునే కియొలిన్ అను నొక తరహా పరిశుభ్రమైన మట్టితోచేర్చి మాత్రలుచేసి ఒక్కొక్క మోతాదునకు ఒకటిలేక రెండు గ్రెయినులు చొప్పున గంటకొక్కకమాత్రచొప్పున ఇచ్చినను ఇయ్యవచ్చును. వైద్యుడు తన కనుకూలించిన ప్రకారము మాత్రలనుగాని ద్రావకమును గాని ఉపయోగింప వచ్చును.

నిమ్మకాయ పులుసుతో చికిత్స.

2. కలరా సూక్ష్మజీవులు పుల్లని ద్రావకముల లోచచ్చును. పరిశుభ్రమైన నీళ్లలో నిమ్మకాయ రసమునుపిండి, త్రాగుటకనుకూల మగునంత పుల్లగాచేసి, ఆ నీటినిమాటిమాటికి త్రాగించినయెడల, ఆ నీళ్ళు కడుపులోనికిపోయి కలరా సూక్ష్మజీవులను చంపునని కొందరియభిప్రాయము. ఈ చికిత్సవలన ననేక రోగులకు కుదిరినదని వాడుకగలదు. కొన్ని చోట్ల నిమ్మకాయనీటికి బదులుగా పుల్లని తరవాణి నీళ్లనుగాని, పుల్లని కల్లు నీళ్లనుగాని (Veniger) ఇచ్చెదరు. నేను సాధారణముగా నీ నిమ్మకాయ నీటిలో నొకపాడుముపట్టంత సూరేకారమును త్రాగి

పప్పు డెల్లనుచేర్చి యిత్తురు. ఇందుచే మూత్రము జారీగా అగునని కొందరి అభిప్రాయము.

11. వ్యాధియొక్క గుణములను బట్టిచూడగా గుణములను ఈక్రిందవ్రాసిన 8 విషయములు ముఖ్యమైనవిగాబట్టి చికిత్స చేయుచున్నారు.

1. విరేచనములను ఆపుట.

2. వాంతికట్టించుట.

3. శరీరముయొక్క వేడిమి తగ్గిపోకుండ కాపాడుట.

4. విరేచనముల మూలమున శరీరమునందలి నీరంతయు పోవుటచే శరీరమునందలి నెత్తురు చిక్కబడును. అట్లు చిక్కబడిన నెత్తుటినిపలుచన చేయుటకును, తగ్గిపోయిన నెత్తుటిని తిరిగి పూర్తిచేయుటకును ప్రయత్నించుట.

5. నీరసించిన నాడికి బలమునిచ్చుట.

6. కాళ్లుచేతులు కొంకరులుపోకుండను ఈమూర్ఛకొనిపోకుండను చేసి రోగియొక్క బాధను నివారణచేయుట.

7. హరించిపోయినమూత్రమును తిరిగి స్రవింపచేయుట.

8. పథ్యము.

## 1. విరేచనములను ఆపుట.

విరేచనములను ఆపుటకు చికిత్స.

ఇందు కొరకు సామాన్యముగా లెడ్ అసిటేటు 20 పాళ్లును, నల్లమందు 1 పాలును, హారతి కర్పూరం 10 పాళ్ళనువేసి కలియనూరి ఒక్కొక్క మూత్ర తిత్రిగెయి నుల చొప్పున మాత్రలుకట్టి అరగంటకొక మాత్ర విరేచనములు కట్టువరకు ఇచ్చెదరు. మరికొందరు

డైల్యూటు ఆరోమేటిక్ సల్ఫ్యూరిక్ ఆసిడ్డు. } 15 చుక్కలు

నల్లమందు ద్రావకం 15 చుక్కలు

గ్రుక్కెడు నీళ్లతోచేర్చి 3 గంటల కొకసారి ఇచ్చెదరు. ఇతరులు

కాంఫర్ డ్రైన్ 10 చుక్కలు

*డైల్యూటుసల్ఫ్యూరిక్ ఆసిడ్డు 15 చుక్కలు గుక్కెడు నీళ్లతో 3 లేక 4 గంటల కొకసారి ఇచ్చెదరు.

ఈ మందులు కొంతవర కుపయోగమే కాని వీని కంటె ఈక్రింద వ్రాయబోవు మందు కలరాయొక్క ప్రారంభ స్థితిలోని విరేచనములకు మిక్కిలి యుప యుక్తమని తోచుచున్నది.

---

* అనగాసల్ఫ్యూరిక్ ఆసిడ్డు-9 పాళ్లు మంచినీళ్ళు-11పాళ్ళు.

| | |
|---|---|
| ఆరోమేటిక్ సల్ఫ్యూరికు ఆసిడ్ డైల్యూటు | 20 చుక్కలు |
| కవిరిద్రావకం(Tincture Catechu) | 60 చుక్కలు |
| ఓమద్రావకము లేకసోపువిత్తుల ద్రావకము (Spirits Anethi) | 15 చుక్కలు |
| నల్లమందుద్రావకము(Tincture Opii) | 10 చుక్కలు |
| స్పిరిట్సు ఈథరు (Sqirits Aether) | 15 చుక్కలు |
| మొత్తము | 120 చుక్కలు |

ఈ మందు కొక్క మోతాదు పెద్దవాండ్రకు 60 మొదలు 120 చుక్కలు. ఒకమోతాదును 3 గంటల కొకసారిగాని, విరేచనములు హెచ్చుగ నుండిన యెడల ఒక్కొక విరేచనమునకు ఒక్కొక మోతాదు చొప్పునగాని ఇయ్యవలెను.

ఆడవాండ్రకు అరమోతాదులతో ప్రారంభింపవలెను. 12 సంవత్సరములలోపు వయస్సుగల పిల్లలకు సంవత్సరము వయస్సునకు 5 చుక్కలుచొప్పున ఈయవలెను. సంవత్సరములలోపు పిల్లలకు నెల వయస్సునకు అరచుక్క చొప్పున ఇయ్యవచ్చును. అయినను పిల్లల కిచ్చునప్పుడు జాగ్రతగా చూచుచుండవలెను. ఈ మందును ఎల్లప్పుడు ఒక్కొక మోతాదు ఒక ఆవున్సు అనగా గ్రుక్కెడు నీళ్ల

తో చేర్చి ఇయ్యవలెను. కొంచెము నీళ్ళు ఎక్కువ చేర్చినను జబ్బులేదు. ఈ మందును సాధారణము గా కలరా విరేచనముల కేగాక ఇతర విరేచనము లకుగూడ వైద్యుడు తన అనుభవము కొలదిని ఉపయోగించు కొనవచ్చును.

ఇది సాధారణముగా ప్రతి ఇంగ్లీషు మందుల అంగడిలోను ఆసుపత్రిలోను దొరుకును. ఒక మోతాదునకు సాధారణముగా ఒకటి రెండు అణాలు ఖరీదు ఈయవచ్చును.

మొదటి దశలో పైనచెప్పిన మందు లన్నియు కొంతవర కుపయోగకరముగా నుండవచ్చును. కాని కొందరకొలది ఆ మందు కాదని ఇది అదికాదని యిం కొకటి లెక్కలేకుండ నియ్యకూడదు. అనవసరమైన మందులను మితిలేకుండ నిచ్చినయెడల అవి రోగికి హానికలుగచేయవచ్చును. ఏలయన, కడుపులో అట్టి సమయమున ఏది పడినను వాంతిబాధ అధికమగు ను. ఒకవేళ అది ఇమిడినను శరీరమునందలి రక్త ప్రవాహము అప్పుడు మిక్కిలి మందమై యుండుట చేత ఆమందులు జీర్ణము కానేరవు.

విరేచనము లధికముగా నుండక కడుపునొప్పి యు కాళ్ళు తీపులును మిక్కిలి అధికముగా నున్న

మొదల నల్లమందు కొంతవరకుపయుక్తము. దానిని గూడ పైజెప్పిన కారణములచేత నోటిమార్గమున నిచ్చుట కంటె నేర్చినవైద్యుడు దానికి బదులుగా మార్ఫియాను గురిగింజలో 8 వ వంతు మొదలు నాలవ వంతువరకు నెత్తురులోనికి బోలుసూదిగల గాజుపిచికారీతో ఎక్కించుట యుక్తము.

విరేచనమును నిలుపుటకై వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారు ఈ క్రింది ప్రయోగములను వ్రాసియున్నారు. ఆయుర్వేదీయ చికిత్స.

౧. " శుద్ధిచేసిన ఇంగిలీకము.
నల్లమందు.
తుంగముస్తలచూర్ణము.
కొడిశపాలవిత్తులచూర్ణము.
జాజికాయచూర్ణము
హారతికర్పూరము.

వీని నన్నింటిని సమభాగములుగ గ్రహించి ఖల్వములోవేసి చక్కగ నీళ్లతో మెత్తగ మాత్రలగు వరకు నూరి పెసలవలె మాత్రలుచేసి నీడను యెండించి సీసాయందు జాగ్రతచేయవలయును. విరేచనములు అధికమగుచుండెనేని, రెండేసి గంటలకు రెండు మాత్రలు చొప్పున విరేచనములు నిలుచువరకును

ఇయ్యవలెను. ఈ ఔషధమునకే భైషజ్యగ్రత్నా వళి యను ఆయుర్వేదీయ గ్రంథమందు "కర్పూర రసము" అని పేరుపెట్టబడినది.

౨. తుంగముస్తలచూర్ణము.
కొడిశపాలవిత్తులచూర్ణము.
మిరియాలచూర్ణము.
ఎండు మిరపకాయల చూర్ణము.
హారతికర్పూరము.
నల్లమందు.

వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వములో ఉంచి నీళ్లతో మాత్రయగువరకు మెత్తగ మర్దన చేసి కందిగింజవలె మాత్రలు చేసి సీసాలోవేసి జాగ్రతగా నుంచవలెను. పైని వ్రాసిన ప్రకారము వీనిని ఉపయోగింపవలెను. ఈ మాత్రలనె మా ఆయుర్వేదవైద్యశాలయందు 'ఘనసారవటి' యని వాడెదము.

ఒకతులము ఎండుమెరపకాయ గింజలను మూకుటిలోవేసి దోరమాడ్చి అందు పావుశేరునీళ్లుపోసి కొంచెముసేపుంచి యానీటితో నాగింజలను బాగుగ గలిపి వడగట్టుకొని మంచిపాత్రయందు భద్రము చేయవలెను.

విరేచనములు ఆరంభమైనతోడనే ఒక్కొక్క గంటకు గుక్కెడు కషాయమును త్రాగవలెను. ఈ కషాయమునే పైనిజెప్పిన రెండురకముల మాత్రలకు అనుపానముగ కొంచెము పంచదారతో కలిపిఇయ్య వచ్చును.

3. శుద్ధ రసకర్పూరము.
శుద్ధ రససిందూరము.
శుద్ధ ఇంగిలీకము.
శుద్ధిచేసిన వత్సనాభి.
పాపుదారు.
గోరోజనము.
మిరియాలు.
కస్తూరి.
జున్ను (లేక అడిపచ్చికాన).
నల్లమందు.

ఈ వస్తువులను సమభాగములుగ గ్రహించి, కస్తూరినల్లమందుగాక, మిగిలిన అన్నివస్తువులను ఖల్వము లోవేసి చనుబాలతో మెత్తగానూరి బిళ్లగాచేసి ఆ బిళ్లలను, లేతరావియాకు మడతలో ఉంచి పైన దారముతోకట్టి పిడకలనిప్పులో ఉడుకునంతవరకు ఉంచవలెను. అటుపిమ్మట కుమ్ములోనుండి తీసి పైని

ఆకులను విప్పివేసి లోపలబిళ్లనుతీసికొని తిరుగఖల్వములోనుంచి చనుబాలతో బాగుగా రెండుమూడు గంటలు నూరి తిరిగి బిళ్ళచేసి పై ప్రకారము రావి ఆకులమడతలో ఉంచి ఉడుకునట్లు పుటము వేయవలెను. ఈరీతిని ఏడుసార్లునూరుచు పుటము వేయవలెను. ఎనిమిదవతడవ, కస్తూరి నల్లమందు చేర్చి, బాగుగ మూడు జాములు చనుబాలతో నూరి, కందిగింజల వలె మాత్రలుచేసి నీడను ఎండించి సీసాలో భద్రపరచవలెను. విరేచనములు అధికమై నాడి బలహీనమై సర్వశరీరము బలములేకయుండి, మూత్రము వెడలక నిశ్చేష్టితులైయుండెడి రోగులుకూడ వేలకొలది ఆసన్నమృత్యువునుండి తప్పించుకొనియున్నారు. ఇయ్యది మా సప్తపూరుషములనుండి యనుభవసిద్ధమగు ఔషధరాజము ఇయ్యది ఏస్థితిలోనుండు కలరానైనను బోగొట్టుటయేగాక బాలింతలకు గలుగు గ్రహణి, అతిసారములు, ఇతరులకుంగల చిరకాలాతిసారములు గ్రహణి రోగములను కూడ మాన్పును. కలరా రోగులకు ఈ మాత్రలను రెండేసి గంటలకు రెండు మాత్రలు చొప్పున విరేచనములు నిలుచునంతకును ఇయ్యవచ్చును. మోతాదులను వయోధర్మముల ననుసరించి మార్చుకొన

వలెను. ఇతర అతిసార గ్రహణి రోగులకు, రోజుకు 3 సార్లుకాని లేక వ్యాధి కొందరను అనుసరించిగాని బుద్ధిమంతులగు వైద్యులు ఉపయోగపరచవలెను. ఈ మాత్రలనే మా వైద్యశాలయందు "కస్తూరి గ్రహణిమాత్రలు" అని వాడెదము.

౪. మరియుకొందరు దేశీయవైద్యులు భాండవ కర్పూరము (రసభస్మము లేక ఇంగిలీక భాండవము) అనుదానిని వారికి తోచినట్లు కలరా రోగులకుపయోగించెదరు. ఇయ్యది కలరా రోగులకు మంచిదైనను ఉపయోగించెడి వారలు, కొంచెము జ్ఞానము గలిగి కలరాయొక్క ప్రారంభదశయందు రోగియొక్క స్థితిని చక్కగ పర్యాలోచనచేసి తగుమోతాదు అనగా నాలుగు మొదలు ఎనిమిది గురిగింజల యెత్తువరకును దీసికొని దానిని చక్కని మాటలో ఒక గురిగింజ ప్రమాణముగల మాత్రలుచేసి, ప్రతియొకగంటకు ఒకటిగాని రెండుగాని మాత్రలు వ్యాధిబలమును చూచుకొని ఉపయోగించిన మిక్కిలి మేలు చేయును. క్రూరస్వభావము గల దీనిని కుశలులగు వైద్యులు రోగిదశను నిరీక్షించి ఉపయోగించుట ఉచితముగాని సామాన్యులు దీనికై సాహసించిన అతి ఘోరముగా పరిణమించును.

మోతాదునుకూడ 4 గురిగింజలు మొదలు 8 గురిగింజలకంటె అధికముగా నుపయోగింప కూడ దని నా మతము."

## 2. వాంతికట్టించుట.

వాంతికట్టించుట. మంచుగడ్డముక్కలు చప్పరించుట కిచ్చుటచేతను మిక్కిలి శీతోదకములను కొంచెముకొంచెముగా నిచ్చుటచేతను వాంతి కొంతవరకు కట్టవచ్చును. కాని కాగిచల్లారి గోరువెచ్చగానున్న నీళ్లలో శేరు నీళ్లకు తులము ఆవాలపిండిచొప్పునవేసి కలిపి అప్పుడప్పుడిచ్చుటవలన కొంచెముసేపటిలో వాంతికట్టునని ఒకరువ్రాయుచున్నారు. మరియొకరు రసభస్మమును పెద్దపెద్ద మోతాదులతో అనగా 15 లేక 20 గ్రెయినులవరకు ఇచ్చుట వలన వాంతితగ్గునని వ్రాసియున్నారు. తక్కిన ప్రయోగము లన్నియు ఉపయోగింపని యెడల దీని నిచ్చి చూడవచ్చును. కాని నీళ్లతో చేర్చి మెత్తగనూరిన ఆవపిండిపట్టు బొడ్డుమొదలు ఎదురురొమ్మువరకు వేసి 40 నిమిషములు మొదలు ఒక గంటవరకు ఉంచుటవలన వాంతి అణగి రోగికి ఉష్ణమునుగూడ నిచ్చును. ఇది మిక్కిలి ఉపయోగకరము. దాహ మధికముగ నున్నచో మంచుగడ్డముక్కల నియ్యవచ్చును. శేరు

నీటికి తులము చొప్పున జీలకర్ర వేసి కాచి చల్లారిన నీటిని కొంచెము కొంచెముగ దాహమున కిచ్చు టచే ఉపయోగింప వచ్చును. వీనిచే వాంతి కట్టని యెడల కొకెయినును గ్రెయినులో నాల్గవ వంతు ఇచ్చిచూడవచ్చును. క్రియసోటు, హైడ్రోసయానిక్ ఆసిడ్ డైల్యూట్యు వీనివలన అంతగా ఉపయోగము లేదు. మంచుగడ్డ ముక్కలతో చేర్చి సోడా లెమ నేడు మొదలగు పొంగునీళ్లను కొంచెము కొంచె ముగా నిచ్చుటవలన వాంతి కొంతవరకు తగ్గవచ్చును.

గోపాలాచార్యులవారు ఇట్లు వ్రాయు చు న్నారు.

"వాంతిని నిలుపుటలో మంచుగడ్డకంటె మంచిది లేదని నాయభిప్రాయము. ఆవపిండిని ఎదురురొమ్ము నుండి బొడ్డువరకు పట్టువేయుట ఉచితము. జీలకర్ర కషాయము నియ్యవచ్చును. ఏలకులను పొట్టుతో కషాయముచేసి, జీలకర్ర కషాయమువలెనే ఈయ వచ్చును. పంచదారపానకములో కొంచెము పులు సెక్కునట్లు నిమ్మకాయ రసమును పిండి ఆ పానకము ను ఒక గుక్కెడు చొప్పున ఇచ్చుచుండవచ్చును. లేత పమిడిపత్తికాయ తేనెతోగాని నిమ్మకాయ రసముతోగాని సానమీద నరగితీసి అప్పుడప్పుడు

ఆయుర్వేదీయ చికిత్స.

నాలుకమీాద కొంచెము కొంచెము రాయుచుండుట మంచిది. నెమలి ఈకలను ఏలకగింజలను ఉసిరికిగింజ లోనిపప్పును తెల్లపట్టుగుడ్డను సమపాలుగా తెచ్చి మూకుడులోవేసి చక్కగా మాడ్చి చల్లార్చి మెత్తగా నూరి శీసాలోవేసి భద్రపరుచు కొనవలెను. ఇది వాంతులకు పదేపదే తేనెతో కలిపి నాలుకకు రాయుచుండ వలెను. మూడుతులముల ఓమమును మూకుడులోవేసి మాడ్చి అందు ఒక శేరు నీళ్లుపోసి కొంచెము సేపుంచి వడియకట్టి, వాంతి నిలుచువరకును ఒక్కొక్క గుక్కెడు ఇయ్యవలెను.

పై రీతిగనే బియ్యపునూకలనుగూడ మాడ్చి నీళ్లుపోసి వడియకట్టి ఇయ్యవచ్చును. వరిపేలాల పిండిని వేడినీళ్లలో కొంచెమువేసి తేటగా కలిపి వడగట్టి అప్పుడప్పుడు వాంతి నిలుచువరకు ఇయ్యవచ్చును. వాంతులు విశేషముగా నున్నప్పుడు పై ద్రవ పదార్థముల నధికముగ నుపయోగించిన, వాంతి అధికమైనను కావచ్చును. కావున వానిని కొంచెము కొంచెముగ ఇచ్చుటమంచిది. వాంతిని కట్టించు ఏ వస్తువునుగాని మంచుగడ్డతో మిళితముచేసి ఇచ్చుట ఉత్తమ మని నామతము. చనుబాల నిచ్చుట

గూడ ఉత్తమము. మంచి సూర్యావర్తిని గూడ వాంతిని నిలుపుటకు ఉపయోగింప వచ్చును.

ఎక్కిళ్లు నాపుటకు జీలకఱ్ఱ బెల్లము సమముగా నూరి ఉండచేసి ఉంచుకొని కొంచెము కొంచెము ఎక్కిళ్ళు నాపుటకును ఇయ్యవలెను. ఎక్కిళ్లను ఆపుట.

ఏలకులు.

ఆకుపత్రి.

నాగకేసరాలు.

దాచినచెక్క.

వీనిని సమముగాగ్రహించి మంచినీళ్లతో కషాయము పెట్టి వడకట్టి ఆకషాయమును అప్పుడప్పుడు ఎక్కిళ్ళు తగ్గువరకును ఇయ్యవచ్చును. మఱియు వాంతులు తగ్గుటకై ఉపయోగించు మందుల నన్నిటిని ఉపయోగింపవచ్చును. మంచినీళ్ళు దరులలో గల పీతబొక్కలలోని చల్లని నీళ్లనిచ్చుటగూడ మంచిది. వెలగపండు పై బెరడును సానరాతిమీద తేనెతో అరగదీసి ఆగంధమును మాటిమాటికి నాలుకకు రాయుచుండవచ్చును."

3. శరీరమునకు ఉష్ణముకలిగించుట.

కర్పూరతైలముగాని సారా మొదలగు ఇతర ద్రావకములుగాని క్లోరోఫారముగాని శరీరమంత ఉష్ణముకలిగించుటకు చికిత్స.

లను మెల్లగా మర్దనచేయవచ్చును. కాలుచేతులు చలువలు క్రమ్మినప్పుడు శరీరమునకు ఉష్ణముపుట్టిం చు ప్రయత్నములు చేయవలెను. వెచ్చనికంబళి దుప్పట్లతో రోగిని కప్పియుంచి వేడి నీళ్ల సీసాతో శరీర మంతయు కాచవలెను. తవుడుగాని ఇటుకపొడు ముగాని వెచ్చజేసి, గుడ్డసంచులలో వేసి పొత్తికడుపు మీాదను ప్రక్కలయందును కాచవలెను. ప్రశస్త మయిన బ్రాంది మోతాదు ఒక్కంటికి అరఅవున్సు మొదలు 2 అవున్సులవరకు అరపావులెడు మంచినీళ్ల లో చేర్చి ఇయ్యవలెను. కస్తూరిని 1 మొదలు 5 గురిగింజల యెత్తువరకు ఒక్కొక మోతాదు చొప్పున గంట గంటకు ఇయ్యవచ్చును.

రోగిని వేడనీళ్లలోనుంచుట.

లైకరుస్ట్రిక్ నీను (Liquor Strychnine) టించరు డిజిటాలిసు (Tincture Digitalis) అనుమందును కూడ వాతపుదశలో మిక్కిలి ఉపయుక్తములు. వీని మోతాదు 5 మొదలు 10 చుక్కలు. అనుపానము క్రుక్కెడు మంచినీళ్ళు. ఈ మందులను నెత్తురులోనికి బోలుసూదిగుండ ఎక్కించినయెడల వేగముగా పనిచేయును. శరీరము మిక్కిలి చలువలు క్రమ్మిన యెడల 103 లేక 105 డిగ్రీలవరకు నుండెడు అనగా కొంచెము వెచ్చని వేడినీళ్లలో రోగిని తల

వరకునుూంచి పరుాడబెట్టుటవలన గుణాము కలదని చె ప్పుచురు. దీనివలన విరేచనములు మొదట కట్టక పోయినను వాంతులును ఎక్కిళ్లును తగ్గి నాడి స్ఫుట పడి హరించిపోయినమూత్రము తిరిగిస్ఫురించును.

గోపాలాచార్యులవారి ప్రయోగములు.

"కస్తూరిని అర గురిగింజఎత్తు మొదలు ఒక గురి గింజవరకును వ్యాధిబలము ననుసరించి ప్రతి పావు గంట కొకతూరిగాని, అరగంట కొకతూరిగాని రెండు ఉద్ధరిణల చనుబాలతో కలిపి ఇయ్యవలెను. లేక బ్రాందీతోగాని సారాయితోగాని కలిపి ఇచ్చు ట మంచిది. చలువలు తగ్గును. నాడికి బలముకలు గును. కాళ్లకును చేతులకును శరీర మంతటకును చలువలు తగ్గుటకు వెలిబూడిద, ఆవపిండి పసుపు పొడి, వీనిని ఒక్కొకదానినిగాని కొన్నిటినిగాని చేర్చి అందు పచ్చకర్పూరమును పొడిచేసి కొంచెము చేర్చి శరీరముపైన రుద్దవలెను. కర్పూరతైలమును రుద్దవచ్చును. వెల్లుల్లిపాయలను చక్కగా ఒలిచి మెత్తగానూరి కాళ్ళకు చేతులకు పూయవచ్చును. ములగచెక్క పసుపు మెత్తగా పొడిచేసి ఒంటికిరుద్దిన చలువలుతగ్గును. రోగిని మంచికంబళ్లతో కప్పి యుంచవలెను. ఈ చలువలస్థితిలో పైనిజెప్పిన కస్తూ

ఆయుర్వేదీయ చికిత్స.

గ్రహణి మాత్రల నుపయోగించుట అత్యుత్తమ
ము. దీనివలన నాడికి బలము కలుగును. చలువలు
గప్పియున్నప్పుడు నాడి బలహీన మగుటయు మూత్ర
ము తగ్గుటయు విరేచనములు వాంతులు లేకపోవు
టయు గలస్థితిలో నల్లమందు చేరిన మందులను ఏ
మాత్రమును ప్రమాద వశముచేత కూడ ఇయ్య
కూడదు.

కుంకుమ పువ్వు; శుద్ధిచేసిన వత్సనాభి; మిరి
యాలు, జున్ను; పావుదారు ; గోరోజనము; కస్తూరి
ఇవి సమభాగములుగ తెచ్చి కల్వములోవేసి చి
త్రమూలము రసముతో మెత్తగా రెండు మూడు
దినములునూరి కందిగింజలవలె మాత్రలు చేసి నీడ
లో ఆరబెట్టి సీసాలో భద్రపరుచవలెను. దీనినే "క
స్తూరి భైరవము" అని మా వైద్యశాలయందు
వాడుదుము. నాడి బలహీనమై అతి చెమటలు
గలిగి మిక్కిలి బలహీనముగ నున్నపుడు ప్రతి పావు
గంటకుగాని అరగంటకుగాని రెండు మాత్రలు చొ
ప్పున, వేడియును నాడికి బలమును కలుగువరకు
నియ్యవలెను."

నెత్తురునువృద్ధి చేయుట.

4. చిక్కపడిన నెత్తుటిని పలుచన చేయుట.

మిక్కిలి శీతలము క్రమ్మినరోగులకు సహితము

20 ఔన్సులు కాగిచల్లారిన నీళ్ళకు 60*గ్రెయినుల ఉప్పునుచేర్చి ఆనీళ్ళను గోరువెచ్చగ నెత్తురులోనికి పిచికారీచేయుటవలన మిక్కిలి గుణము కలుగుచున్నది. పైనిచెప్పిన చికిత్స లన్నిటికంటె నిదియె ముఖ్యమైనదని ఇప్పుడు కొందరువైద్యులు నొక్కి చెప్పుచున్నారు. జీవించు నను ఆశ బొత్తుగా లేని రోగులకుకూడ ఈ వైద్యము చేసి చూచుట మంచిది. విరేచనము లధికముగా నున్నప్పుడు నెత్తురు చిక్కబడియుండును. అందుచే నెత్తురుకాలువల గుండ తగినంత నెత్తురు ప్రవహింపక పోవుటచేత శరీరము యొక్క వేడి తగ్గిపోవుచున్నది. రక్తప్రవాహము చాలినంత లేక పోవుటచేతనే మూత్రకోశములు కూడ పని చేయలేక యున్నవి. అందుచేతనే మూత్ర క్రమక్రమముగ తగ్గిపోవుచున్నది. ఇట్టి రోగ రును పలుచన చేయుటకు మిక్కిలి

ఉప్పునీళ్లనుకాచి చల్లార నిచ్చి నులి నట్లు చల్లార్చి ఇందుకొరకు సూదిగుండ రక్తములోనికి

---

* గ్రెయిను అనగా గురి వడ్లగింజల యెత్తు.

ఎక్కించుట మిక్కిలి ఉపయోగకరము. పైని చెప్పిన ఉప్పునీళ్లకు బదులుగా ఈక్రిందిప్రకారము తయారు చేయబడిన నీటిని ఉపయోగించుటవలన హెచ్చు లాభము గలుగునని ప్రస్తుత మనేక వైద్యుల యభిప్రాయము. ప్రత్యేక మిదేచికిత్సమాత్రము చేసి చూడగా సకాలమునకు వైద్యమునకు వచ్చిన రోగులలో నూటికి 30 మందికి కుదిరినదని కలకత్తా జనరల్ హాస్పిటలులోని వైద్యులొకరు వ్రాసియున్నారు. వీలయినచో ఈనీటినిఉపయోగించుట శ్రేష్ఠము.

ఉప్పు (Sodium chloride) 130 గ్రెయినులు, పొటాసియము క్లోరెడు (Potadssiam chloride) 6 గ్రెయినులు, కాల్సియముక్లోరెడు 4 గ్రెయినులు ...నిసి పొడిచేసి 20 ఔన్సులు కాగి చల్లారిన నీటిలో చక్కగా కరగిపోవునట్లు కలపవలెను. ఈ ఔష...ు ఈపాళ్ళతో చేర్చి చేసినమాత్ర లిప్పుడు ... చెన్నపట్టణములో దొరకును. దానికి ...గ సెలైను సోల్యూషను (Hypertonic ...ను. ఈద్రావకమును నులి...ను నెత్తురులోనికి ఒక రక్త... గాని, చర్మము క్రిందనుండు ...లెను. ఇట్లు చేయుటకు

తగినసాధనములు వైద్యులవద్ద నుండును. మిక్కిలి ఆలస్యముచేయక ఈ చికిత్స తరుణములో చేయుట యుక్తము.

5. నీరసించిన గుండెలకు బలమునిచ్చుట.

నాడి మిక్కిలి నీరసముగా నున్నప్పుడు పైచె నాశల పని ప్పిన ప్రకారము బ్రాందిని అరఅవున్సు మోతాదుల చుట. చొప్పున గంటగంటకు ఇయ్యవలెను. లైకరుస్ట్రిక్ సీన్ అను మందును 5 మొదలు 10 చుక్కలు చొప్పున మంచినీళ్లలో ఇయ్యవలెను. లేదా నెత్తురు లోనికి పిచికారీ చేయవలెను. పైనచెప్పిన ఉప్పునీటిని నెత్తురులోని కెక్కించినయెడల గుండెకాయలోనికి తగినంత నెత్తురు ఎప్పటికప్పుడు చేరుచుండును అందుచే గుండెకాయ క్రమముగ పనిచేసిశరీర వా టకు క్రమమైన రక్తప్రవాహమును ఉ కలుగజేయును.

6. కాళ్ల తీపులు నివా

నల్లమందు కొంతవరకు దీనికి ప మిక్కిలిబాధగా నున్న యెడ మొదలు అరగ్రెయినువరకు చేయవచ్చును. కర్పూర పుట్టించు మందులను

పిసుకవచ్చును. కాళ్లయొక్కయు చేతులయొక్కయు పైభాగములయందు గుడ్డలతో బిగించి కట్టవచ్చును. కాని క్రిందిభాగమునందు బొత్తిగ నెత్తురు క్షీణించిపోకుండ అప్పుడు ఈ కట్లు విప్పితిరిగి కట్టుచుండ వలెను.

"మడమలయందు సూదితో రక్తవేయుట శాస్త్రమున నుదాహరించియున్నట్లు అనేక దేశీయ వైద్యులుకూడ చేయుచున్నారు. ఈక్రియ ఉపయోగకరమైనదైనను క్రూర మైనదిగాన సుకుమారి దేహులవిషయమై వైద్యవరులు యోచింపతగినదిగా నున్నది"

7. హరించిపోయిన మూత్రమును
తిరిగి స్రవింపజేయుట.

మూత్రము సరిగా స్రవింపనియెడల నల్లమందు
హాగింప కూడదు. చిట్టుముకు నీళ్లను పలుచని
ంజి నీళ్లను సోడా లెమినేడు మొదలగు
ను ధారాళముగా నీయవచ్చును. పొత్తి
వెచ్చవెచ్చగ కాచుటచే మూత్రము
చ్చును.
నయిట్రోసి(Spirits aetheris
20 మొదలు 40 చుక్కల
తాగుట కిచ్చిన యెడల

మూత్రము త్వరలో స్రవించును. సూరేకారము 2 మొదలు 10 గురిగింజల యెత్తువరకు అరసోలెడు నీళ్లలో కలిపి రెండుగంటల కొకతూరి మూత్రము స్రవించు వరకు నీయవచ్చును. పైని చెప్పిన ఉప్పునీళ్ల ఇంజక్షను వలన శరీరమునందలి రక్తమును, రక్తమునందలి నీరును, అధికమై మూత్రము త్వరలో స్రవించును. నడుమువీుద మూత్రతిత్తు లుండుచోట ఆవాలపిండి పట్టీలను వేయుట మంచిది.

గోపాలచార్యులవారు ఇట్లువ్రాయుచున్నారు.

"మూత్రము తగ్గిన సమయమున నల్లమందు చేరినమందులను ఏమాత్రము ఉపయోగింపకూడదు. కేవల చిన్ని, సూరేకారము బ్రాందితోగా సారాయితో గాని నీటితోగాని, మెత్తగా అర్ర పొత్తి కడుపునకు గంట గింటకు పట్టు వేయ ప్రతితడవను, పాతపట్టు తీసివేసి క్రొత్తది వలెను. సూరేకారమును తెల్లగలిజేర కొంచెము వేసి నీళ్లుపోసి ? నటుల కాచి ఆ నీటిలోక పిండి ఆవిరిగల ఆ కంబళిగ వేసి కాచవలెను. ఇట్లు

దానిని వేడినీళ్లలో అద్ది మూత్రము వచ్చువరకు కాపువేయు చుండవలెను.

సుప్రసిద్ధమగు వైద్యచింతామణి యందలి శంఖ ద్రావకము క్షారద్రావకములను 10 బొట్లు ఒక గ్రుక్కెడు నీళ్లలో కలిపి ప్రతి ఒకగంటకు మూత్రము వచ్చువరకు ఈయవచ్చును. వీనిలో క్షార ద్రావకము మంచి దని నా మతము."

ఉష్ణదశ. మూడవ దశలో శరీరములో ఉష్ణము అధికమయ్యె నేని రోగికిచల్లగనుండునట్లు చేయవలెను. విరేచన మింకను కట్టనియెడల నల్లమందు కలిసిన మందులను వగరు పదార్థములు కలిసిన మందులను ఇయ్యవచ్చును.

చికిత్సయందలి ముఖ్యాంశము లేవియనగా:—

'. రోగి మొట్టమొదట వైద్యునివద్దకు వచ్చిన వగరుగల మందుల నిచ్చి విరేచనములు చేయవచ్చును. అట్టిమందు లన్నిటిలోను ...టలో వ్రాయబడిన కవిరి ద్రావక ...లి యుపయుక్తము. లేదా ...మను ఈయవచ్చును. కాని ...ము కలిసియుండుటచే వీని ...టవలన మూత్రము

హరించి పోవచ్చును. కావున వీనిని జాగ్రత్తగ వాడ వలెను. కస్తూరి, రసభస్మము, హరతి కర్పూరము కలిసిన మాత్రలు ఉపయోగింప నగును 67 పుట చూడుము.

1. వీనివలన విరేచనములు కట్టక పోయినను లేక రోగి మొదటిదశ దాటిన తరువాత వైద్యుని వద్దకువచ్చి నప్పుడును నోటిమార్గమున చిన్న చిన్న మోతాదులుగా రసభస్మము నియ్యవలెను. పొటా సియము పర్మాంగనేటును మాత్రలుగా గాని దాహ మున కిచ్చు నీళ్ళగా గాని ఉపయోగింపవలెను. లేదా దాహమునప్పు డెల్లను నిమ్మపండు రసము పిండిన నీటిలో ఒకచిటికె సూరేకారము చేర్చి ఇయ్య వచ్చును. ఆసనమార్గమున టానిక్ ఆసిడ్ను ఇయ్య వచ్చును.

3. రోగికి కాళ్ళుచేతులు చల్లబడి స్థితిలో నుండుట తటస్థించినయెడల రోగికి ఉప్పునీళ్ల ద్రావకమును నెత్తురులోని మూలముననను, ఆసనమార్గముననను వ్యాధి మిక్కిలి ముదిరి పోయినత లనకూడ ప్రయోజన ముండక ము ప్రారంభము కాక పూ

ప్రారంభించుట యుక్తము. వేడినీళ్ల సీసాలతో కాచు చు, వేడిదుప్పట్లు కప్పి వేడి పుట్టునట్లు తైలములను మర్దన చేయవలెను. ఈ స్థితిలో బ్రాందిగాని, లైకరుప్ట్రిక్నీను గాని కస్తూరిగాని లోపలి కియ్య వలెను. లేదా నెత్తురులోనికి పిచికారీ చేసి శరీరము లోని ఉష్ణమును కాపాడవలెను.

8 పథ్యము.

పథ్యము. కలరా తగిలిన రోగికి వాంతులు అధికముగా ఒకవేళ ఇమిడినను జీర్ణమగుట కష్టము. కావున వ్యాధి యొక్క ఉద్ధృతము అణగువరకు ఆహారము ఏమి యును ఈయకుండుట ఉత్తమము. దాహమైనచో కాగి చల్లారిన నీళ్ళు కొంచెము కొంచెముగా గాని జీల కర్రవేసి కాచిననీళ్ళుగాని, సోడా మొదలగు పొంగు

...గాని పొటాసియం పర్మాంగనేటు నీళ్ళుగాని,
...యరసము చేర్చిన నీళ్ళుగాని, తరవాణిగాని,
ముక్కలతో చేర్చి ఇయ్యవచ్చును.
ము లొంగినతరువాత చిట్టుడుకు నీళ్ళ
ు వేయించి ఆపేలాలు వేసి కాచి
సమభాగములుగా నీళ్లుకలిపి కాచి
చ్చును. పాలు జీర్ణము కాని
తేటనీళ్ళును సమభాగము

లుగాచేర్చి ఇయ్యవచ్చును. కొంచెము జీర్ణశక్తి వచ్చినతరువాత, క్రమముగా నూకలజావ, గోధుమజావ, సగ్గుబియ్యపుజావ, మొదలగునవి, చారుతోను, పాలతోను, కలిపి ద్రవపదార్థములుగా ఒకటి రెండు దినముల వరకు ఇచ్చుట మంచిది. పచ్చళ్లను, ఊరుగాయలను కొంచెము కొంచెముగా నంచుకొనుటకీయవచ్చును. బార్లె బియ్యపుగంజి అరరూటుపిండి గంజి మెల్లిన్సు ఆహారము, డబ్బాపాలు మొదలగునవి కాచి నీళ్లతో చేర్చి ఈయవచ్చును. ఇవి పాలకంటె చిక్కగ నుండునట్లు తయారు చేయకూడదు.

ఐదవ ప్రకరణము.

---

కలరాను నివారించు పద్ధతులు

రోగిని ఆసుపత్రికి పంపుట.

ఒకఇంటిలో నొకమనుష్యునకు కలరా తగిలిన దని తెలియగనే ఇంటిలోనివారలు వ్యాధిని రహస్యముగా దాచిపెట్టక తక్షణమే వైద్యునకు కబురు పంపవలెను. సాధ్యమగునని తోచినచో రోగినితక్షణమే, ఆసుపత్రికి పంపుటమంచిది. రోగిపక్షమున ఆలోచించినయెడల, వైద్య మక్కడ చక్కగా జరుగును. వైద్యులుదగ్గరఉండి చక్కగాచూచు చుందురు. తగిన నౌకర్లు మొదలగువారు ఏర్పడియుందురు. రోగియొక్క బంధువులవిషయమై ఆలోచించి ...యిన, సాధారణముగా మన దేశములో వాడుక ...ము ఒకరియింటిలో వ్యాధివచ్చిన దనగానే, ...లును, బంధువులును, అందరునుచూచుటకు అసలే రోగియొక్క సంరక్షణవిషయ ...టకే ఇంటిలోనివారలకు కష్టము ...కివచ్చిన బంధువులకు, అనగా ...రుదులు వగైరాలకు, భోజన ...లెను. ఇవి అన్నియుచేయు

వార లా యింటిలో సాధారణముగా ఒక్కరుగానే యుందురు. అట్టిసమయములో ఒకొ్కకనాడు ఇంటిలో భోజనము లేక, ఇంటికివచ్చినవార లందరును మాడుచుందురు. ఒకవేళ దొరకినను వేళతప్పిన భోజనమే దొరుకును. దానికి తోడుగా, నౌకరిచేయు నౌకర్లు మొదలగువారలు రోగివద్దనుండి తెచ్చిన మయిలను ఇంటిలో కలపకుండుట దుర్లభము. ఇందుచే బంధువులకుగూడ అంటువ్యాధి సంభవించుటకును, వారిగుండ ఈవ్యాధి ఊరు, ఊరునకు వ్యాపించుటకును, కారణ మగును.

కావున ఆసుపత్రికి పంపుట రోగికిని, బంధువులకును, స్నేహితులకును, కూడ ఉత్తమము. ఒకవేళ రోగి మిక్కిలి భాగ్యవంతు డయియుండి, వైద్యులను తన యింటికే పిలిపించుకొన తగిన సామర్థ్యము కలవాడైనప్పుడును, గ్రామములో ఆసుపత్రి లేనప్పుడును, కలరా మయిలను ఇంటిలో కలపకుండ చేయుటకు ఈ క్రిందిఏర్పాటులను గమనింపవలెను.

1. రోగిని ప్రత్యేకముగా నొకగదిలో నుంచవలెను. ఆ గదిలోనుండు అనవసరమైన సామానులను బట్టలను, ముందుగా తీసివేయవలెను. గది ప్రత్యేకముగా నుంచుట.

మందునీళ్లలో తడిపిన తెర కట్టుట.

2. ఒకదుప్పటిని మందునీళ్లలో తడిపి ఆ గదియొక్క గుమ్మమునకు అడ్డముగా తెరవలె వ్రేళ్లాడగట్టవలెను. అట్లుచేసినయెడల ఈమార్గమున నీ గదిలోనుండి వెలుపలకు మయిల పోజాలదు. ఇదిగాక ఇతరు లెవరును ఆ గదిలోనికి పోగూడదని తెలియజేయుటకీ తెర గుర్తుగా నుండును.

కిటికీలు తెరచుట.

3. ఆ గదియొక్క కిటికీలను తెరిచి యుంచవలెను.

సేవకులను ప్రత్యేకముగా నుంచుట.

4. రోగికి సేవ చేయుటకు ఒకరి నిద్దరిని ప్రత్యేకముగా నేర్పరుపవలెను. వారలు ఇతరుల నెంతమాత్రమును తాకకూడదు. వారలు వేసికొనుబట్టలు ఉతికి ఆరవేసికొనుటకు వీలయినవిగా నుండవలెను. రోగికి నౌకరీ చేయువారలు నివసించుటకు ప్రత్యేకము ఒకస్థలము ఏర్పాటుగా నుండవలెను. వారల బట్టలు ఇతరుల బట్టలతో కలిపివేయకూడదు. ఆ బట్టలను వారలపని తీరిన తోడనే మందు నీళ్లలో వేసి,కొంతసే పుంచిన తరువాత ఉడకబెట్టవలెను. వారు భోజనముచేయక పూర్వము చేతులను మందునీళ్లలో 5 నిమిషములకు తక్కువ కాకుండ ముంచి యుంచవలెను.

5. రోగిని చూచుటకు వచ్చువారల నెవ్వరిని గదిలోనికి రానియ్యకూడదు. మిక్కిలి అవసరమైనచో తెర ఈవలనుండి మాట్లాడవలెను. లేదా కిటికీలగుండ మాట్లాడవలెను. ఇంటిలోని పిల్లలను బడికిపోయి ఇతరుల పిల్లలతో కలియనీయ కూడదు.

రాకపోకల నాపుట.

6. రోగియొక్క విరేచనములను వాంతులను మందునీరుగల తొట్టిలో పోసి ఎప్పటి కప్పుడు గోతులలో పూడ్చివేయవలెను. రంపపుపొట్టుతో కలిపి కాల్చివేసినను కాల్చవచ్చును. కాని పల్లెటూరిలో చేయునట్లు నడివీధులలో వేసి ఊరందరికి కలరా వ్యాపించునట్లు చేయరాదు.

విరేచనములను వాంతులను పూడ్చుట.

7. రోగి పాడుచేసిన బట్టలను మందునీళ్లలో వేసి పెట్టి పిమ్మట ఉడకవేయవలెను.

రోగిబట్టల నుడకవేయుట.

8. రోగిని, రోగము నెమ్మదించిన వెంటనే, మందునీళ్లలో స్నానము చేయించవలెను. లేదా మందునీళ్లగుడ్డలతో శరీరమంతయు చక్కగ తుడిచి వేయవలెను.

స్నానము.

9. రోగి గదినివిడిచిన తరువాత దానిగోడలను, నేలను, చక్కగ మందునీళ్లతో కడిగి వేయవలెను.

గదిశుద్ధి చేయుట.

౮-వ పటము.



గోడలమీఁద మందులనీళ్లను చల్లుటకుపయోగించు చిమ్మెడు గొట్టము(Pump)

గంధకము మొదలగునవి పొగవేసినను మంచిదే. తరువాత ఆగదికి సున్నము వేయించవలయును.

10. రోగి విడిచిన ఆహారాదులను ఇతరులను తిననీయరాదు. కాల్చివేయవలెను. లేదా మందు నీళ్లతో కలిపి గోతులలో పూడ్చివేయవలెను.

11. రోగి చనిపోయిన యెడల వానిశరీరమును మందునీళ్లలో తడిపిన దుప్పటిచే కప్పియుంచవలెను. సాధ్యమయినంత త్వరలో దహనాదులు చేయవలెను.

ఇంటిలోనివార లందరును అంగీకరించి వైద్యునకు సహాయము చేసినను పైని చెప్పిన విధు లన్నియు గమనించుట కష్టము. కావున రోగిని ఆసుపత్రికి పంపుటకు వైద్యుడు ప్రోత్సాహము చేయవలెను. అది సాగనియెడల సాధ్యమైనంతవరకు మైలను వ్యాపింపకుండజేయుట వైద్యుని విధియై యున్నది.

వ్యాధిని వ్యాపింపకుండ చేయుటకై జ్ఞాపకముంచుకొనవలసిన యితర జాగ్రతలు.

వ్యాధిని ప్రచురపరచుట.

1. కలరా అంకురించిన దను అనుమానము కలిగిన తోడనే, ఆ సమాచారమును రోగియొక్క బంధువుడుగాని, ఆరోగి నివసించు ఇంటిలోని ఇతరు డెవ్వడయినగాని, వైద్యుడుగాని, చిన్నగ్రామమైన

చో గ్రామమునసబునకును, పట్టణమైనచో మునిసిపాలు ఉద్యోగస్థులకును తెలియపరచవలెను. గ్రామమునసబు ఆ సంగతిని తక్షణమే తహశ్శీలుదారునకు తెలియపరచవలెను. సర్కారువారు వెంటనే అట్టిస్థలములకు తగిన వైద్యుని పంపుదురు. అట్లు చేయనివారలకు కఠినమయిన శిక్ష విధింపవలెను.

2. నీటియందు మైలచేరకుండ చూచుకొనవలెను. గ్రామములో అందరును నీటిని కాచి త్రాగవలెను.

3. వీధులయందును, ఇంటిదొడ్లయందు నుండు పెంటలు మురుగుకుంట్లు మొదలగునవి శుభ్రముగా నుంచుకొనవలెను.

మితాహారము.

4. మితముగ భోజనము చేయవలెను; పచ్చి కాయలుగాని మాగిపోయిన కాయలుగాని తినకూడదు. చెడిపోయిన మాంసము చేపలు మొదలగునవి విసర్జింపవలెను.

పాలు పెరుగులను మయిల పడకుండనుంచుకొనుట.

5. అన్నముగాని ఇతర ఆహార పదార్థములు కాని చల్లారినవానిని తినకూడదు. పాలకు ఎట్టి మయిలయును సోకకుండ జాగ్రత్త పెట్టవలెను. ముఖ్యముగా మనదేశములో, పాలలో నీరుకలపకుండ అమ్మనే అమ్మరు. అట్లు కలిపెడు నీళ్ళలో కూడ పరిశుభ్ర మయిన నీళ్ళయినను కలపరు.

అస్మోమను వారలు తక్కువజాతిలోని బుద్ధిహీను లగుట చేత ఎట్టి బురదనీళ్ళయినను చేర్చుదురు. కావున తగిన జాగ్రత్తతో కాచినపాలు తప్ప ఇతరము లను నిషేధింపవలెయును.

6. పెండ్లిండ్లు మొదలగు ఉత్సవములు మాను కొనవలెను. జనసంఘములు చేరు యాత్రా స్థలములలో పరిశుభ్రమైన మంచినీరు దొరుకునట్లు సర్కారువారు తగిన యేర్పాటులను చేయవలెను. అక్కడక్కడ మరుగుదొడ్లను కట్టించి వానిని తరుచుగ శుభ్రపరిపించుట సర్కారువారి విధిఅయి యున్నది. వానినిజాగ్రత్తగానుపయోగపరచుకొనుట ప్రజలవిధిఅయియున్నది. కలరావ్యాధిసోకినతోడనే రోగియొక్క బంధువులు ఆ సంగతిని దాచుకొనక, సర్కారు ఉద్యోగస్తులకు తెలియపర్చవలెను. తక్షణము అట్టివారిని, వారికొరకై ప్రత్యేకముగా నిర్మించిన పాకలలో బెట్టి వారికి తగిన చికిత్స సర్కారువారు చేయవలెను. ఇట్టి ఏర్పాటులు పుణ్యక్షేత్రములనేగాక, ప్రయాణీకులు మజిలీలు చేయు చుండు సత్రములలో కూడ చేయనలెను. సర్కారు నౌకర్లు ప్రజలను నిర్బంధపెట్టి, బెదిరింపక వారలకు చక్కగబోధించి వారి సౌఖ్యముకొరకే

ఉత్సవాలను మానుకొనుట.

యేర్పాటు లన్నియు చేయబడుచున్న వని నచ్చజెప్ప వలయును. లేనిచో ప్రజ లీవ్యాధులను రహస్యముగా దాచిపెట్టి వ్యాధిని వ్యాపింపజేయుటయేగాక, సర్కారు నవుకర్లుజేయు ప్రతిపనికి అడ్డమువచ్చుచుందురు. పైగా తెలివిమాలిన ప్రజలను రెచ్చబెట్టిన యెడల వారు తమలాభ నష్టములను తెలిసికొన లేక తమ కేదియో అపాయమువచ్చు నని భయపడి సర్కారునవుకర్లకు హానికలుగ జేయుదురు. ఇట్టి స్థలములలో నట్టి ప్రజల బలగము సర్కారు నవుకరుల యొక్క బలగము కంటె నెక్కువగ నుండుటచేతను, భక్తియను మూఢవిశ్వాసము, యాత్రపరుల కావేశమును కలిగించుటచేతను, పోట్లాటకును, దొమ్మీలకును అవకాశము గలుగుచుండును.

వ్యాసములను వ్రాసి పంచి పెట్టుట.

7. కావున ప్రజలసౌఖ్యమును, తమసౌఖ్యమును గోరు సర్కారు నవుకరు లందరును, ఎంతశ్రమపడి యయినను ఒక్కొక అంశమును ప్రజలకు వివరముగ బోధింపవలెను. ఇందులకై వారు చేయుపనుల యొక్క ఉపయోగములను తెలుపుచు చిన్నచిన్న వ్యాసములవ్రాసి అచ్చువేయించి ప్రజలకు పంచిపెట్టి వారలకు జ్ఞానాభివృద్ధి చేయవలెను.

# Opinions

ఈ గ్రంథముపై

## అభిప్రాయములు

The Madras Mail (25-8-10.)

"Mr. A. Lakshmi Pathy, B. A. M. B. & C. M. is the author of a useful little book on "Cholera," written in easy and popular Telugu· ... The instructions and precautions which are given have been found to be effective in pracical working and Mr. A. Lakshmi Pathi is well-advised to publish it in a cheap and handy form."

---

The Indian Patriot (13-9-10.)

"An interesting book upon "*Cholera in Telugu.*"...This will be of great use to the people, especially the women of the house, who will obtain a clear idea of this cruel desease."

---

The Madras Standard (25-8-10.)

"Dr. A. Lakshmi Pathi B. A. M. B. & C. M. has just brought out a booklet on Cholera in Telugu, which is the 10th of 'the

Vijnana Chandrika Series. It deals with the spread, prevention and treatment of Cholera in a scientific manner, ... Dr. A. Lakshmi Pathi has made use of his professional knowledge to make the book as intetligible as possible to his readers. The language is simple and even where scientific and technical terms are to be used, it employs words the meaning of which will be clear even to the ordinary reader. ... ... The book considering the importance of the subject dealt with and the information embodied in it should be in the hands of every educated man in the Telugu District,"

---

The Hindu (26-8-10.)

"Dr. A. Lakshmi Pathi. B. A. M .B. and C. M. deserves to be congratulated on the excellent exposition of the genesis, spread, prevention and treatment of Cholera which he has given in this booklet. ... ...It is written in simple and popular Telugu and deals with the subject in a way which leaves nothing to be desired. It is full of most

valuable information and practical suggestions, ... It will be a most useful thing if it is widely read and the lessons it contains are put in practice. We cordially commend it to the attention of the Telugu knowing public."

---

" గ్రామములలో నీచిన్నపుస్తకముయొక్క ప్రచారము మహాముఖ్యమయినది."

ఆంధ్రపత్రిక, బొంబాయి.

---

" ఈగ్రంథము ప్రజలయొక్క సౌఖ్యము నిమిత్తమొక్కక యంశమును విపులముగ బోధింపుచున్నది. ఇట్టి సర్వజనోపయోగకరమైన గ్రంథమును వ్రాసిన లక్ష్మీపతిగారును ప్రకటింపించిన విజ్ఞానచంద్రికామండలి వారును మిగులవందనీయులు."

దేశమాత, రాజమండ్రి.

---

" ప్రతిసంవత్సరమును కలరావ్యాధిచే పీడింపఁబడు మనదేశీయుల కిట్టి గ్రంథ మమూల్య మని చెప్పఁగలము."

కృష్ణాపత్రిక, బందరు.

---

" ఈపుస్తకము ఆంధ్రులకందఱకును, స్త్రీపురుషులకు సహా, చక్కగా విశదమగురీతిని సులభ శైలిలో వ్రాయఁబడియున్నది గాన ప్రతియొక్కరును, దీనిని విలిచి గడవెళ్లనవి, ఆరోగ్యమును చెరుపుకొననివారై గ్రంథకర్తకు కృతజ్ఞులౌదురుగాక."

ఆంధ్రప్రకాశిక, చెన్నపట్టణము.

---

# మూడు మాటలు.

---

(1) దేశాభివృద్ధికి భాషాభివృద్ధి గొప్పసాధనము. దేశములోని గ్రంథసంగ్రహంబును వార్తాపత్రికలును నేదోయొక దైవికకారణముచే నేఁడు లేకుండనయ్యెనేని ఆ దేశము తన యాదిమ యుగములోని యనాగరికతకు దిగునని చెప్పుట యతిశయోక్తి గానేరదు. దేశమునందలి వాఙ్మయము ఆ దేశమునకు మేలుగాని కీడుగాని కలుగఁజేయఁగల యొక నిరంకుశాధికారి యని చెప్పవచ్చును. ఇట్టి శక్తిగల వాఙ్మయమున దగిన గ్రంథములు లేని భాష శిశువులవచ్చిరాని పలుకులవంటిదై వ్యవహారమునకును జ్ఞానసంపాదనమునకును పనికి రాకుండును.

(2) ఈ యుద్దేశమును మనమునందిడుకొని మేము దేశచరిత్రలను, ప్రకృతిశాస్త్రములను, వ్యక్తిచరిత్రలను, చరిత్రోపయుక్త నవలలను, నీతిబోధక గ్రంథములను ప్రచురింప సమకట్టితిమి. ఆ ప్రకారము విజ్ఞానచంద్రికా గ్రంథమాల యందిప్పటికి 25 గ్రంథములు ప్రచురితములైనవి. అందు 13 ప్రకృతిశాస్త్రములు, 5 దేశచరిత్రలు, 4 వ్యక్తిచరిత్రలు, 3 నవలలు. ఇవియన్నియు తజ్ఞులగు వారిచే వ్రాయఁబడినవి. చిత్రపటములచే శోభిల్లుచుండును. సుందరమైన క్యాలికో బైండు చేయబడినవి. గ్రంథమాలరూపమున వెలువడు నీ గ్రంథములను ప్రసిద్ధ వాఙ్మయమని విద్వాంసుల అభిప్రాయము.

(3) ఈ గ్రంథములు జనసముదాయము కొనుటకు వీలగునట్లు బహుకొద్ది వెలల కిచ్చుచున్నాము. శాశ్వతపు చందాదారులపద్ధతిని యమ్మబడును. మేముప్రచురించు పుస్తకముల గొనువారు శాశ్వతపు చందాదారులు. అట్టివారికి నూరుపుటలకు 0-4-0 లచొ పోస్టేజి మేమే భరించి యిచ్చెదము. ఇతరులకు పోస్టేజిగాక 0-6-0 లగును. చందాదారులు వెనుకటి పుస్తకములనన్నింటిని గొనునెడల 0-4-0 లు ముందుపుస్తకములను మాత్రము గొనునెడల 1-0-0 ప్రవేశరుసు మియ్యవలెను. 0-4-0 ప్రవేశరుసుమిచ్చి వెనుకటివాని నన్నింటిని యొక్కసారి కొనలేనియెడల ఒక్కొక్కసారి రు 5-0-0 ల వెలగల పుస్తకములు దఫాలవారిగ తెప్పించుకొనవచ్చును. పుస్తకముల వీ. పి. గాపంపి సొమ్ము రాబట్టుకొందుము.

జూన్ నెల.
1914

ఆ. లక్ష్మీపతి. బి.ఏ. ఎం.బి. సి.ఎం.,
మేనేజరు, విజ్ఞానచంద్రిక,
చింతాద్రిపేట, మద్రాసు.

# విజ్ఞానచంద్రికా గ్రంథమాల.

చింతాద్రిపేట మద్రాసు

ఈ గ్రంథములను గవర్నమెంటువారు పఠనీయములుగా నుంచుటకు సమ్మతి నిచ్చియున్నారు. 21-10-13. పేజీ 565 ఫోర్టు సెంటు జార్జి గెజటు.

## రాణీసంయుక్త.

జగద్విఖ్యాతమై, నాలుగు నాటకరచనలకు మార్గదర్శకమై, శైలియందును వర్ణనలయందును, కథాచమత్కారమునందును నిరుపమానమై పండితుల చేతను, పామరులచేతను, పొగడ్తగన్న ఈయద్భుతనవలను గురించి ఎంత వ్రాసినను తనివిదీరదు. దీనింజదివి యందలిసారస్యమును పాఠకులే గ్రహింతురుగాక! గ్రంథకర్త. వేలాల-సుబ్బారావు. 0-12-0లు మాత్రమే.

## హిందూమహాయుగము

ఇది 250 పుటల గొప్పచరిత్ర గ్రంథము. హిందూదేశ కథాసంగ్రహముయొక్క మొదటి భాగము.మనపూర్వుల రాజ్యవిస్తారంబును, అప్రతిమ శౌర్యమును, అకలంక స్వదేశభక్తియు, తెలిసికొనగోరు వారీగ్రంథమును తప్పక చదువవలయును. అత్యంత పురాతనకాలమునుండి మహమ్మదీయుల దండయాత్రవరకు గల చరిత్రమంతయు సవిస్తరముగా వర్ణింపఁబడినది.

బుద్ధ, అశోక, కనిష్క, కాళిదాస, శ్రీహర్ష, చంద్రగుప్త, భవభూతి నన్నయ, తిక్కన మొదలగునపవిత్ర జీవితములు శ్రద్ధతో వ్రాయఁబడినవి.

ఇది యింతవఱకు ఐదుకూర్పులుపడి యెంతో జనసమ్మతమును వడసియున్నది. ఇట్టిది తెలుఁగులో లేదు. అనేక పరీక్షలకును, పాఠశాలలయందును పఠనీయముగ నియమించియున్నారు. నియమించుచున్నారు.

గ్రంథకర్త. కే. వి. లక్ష్మణరావు, ఎం. ఏ. వెల రు. 1-0-0 మాత్రమే.

## పదార్థవిజ్ఞానశాస్త్రము.

దీని నింగ్లీషులో ఫిజిక్సు అనెదరు. ఇది గొప్పశాస్త్రీయ గ్రంథము. ఇందనేక యపూర్వవిషయములు వర్ణింపఁబడినవి. పాఠశాలలోని 1, 2, 3 ఫారములకును ట్రైనింగుస్కూళ్ళకును అనుకూలముగ నుండునట్లు వ్రాయఁబడినది. వెల 0-12-0 లు. గ్రంథకర్త ఎం. సాంబశివరావు, బి. ఏ. ఎల్. టి

# వ్యవసాయశాస్త్రము.

(రెండుభాగములు)

శాస్త్రీయపద్ధతులమీద తెలుగులో వ్రాయబడిన గ్రంథమిదియొక్కటియే. రెండుభాగములలో 5, 6 వందల రూపాయల విలువగల పుస్తకములలోని విషయములు సంగ్రహముగ, సులభశైలిని వ్రాయబడినవి. సుబోధకముగనుండుటకై యనేక పటములను చేర్చియున్నాము. వ్యవసాయాభివృద్ధికిని, దేశము యొక్క భాగ్యవంతమునకును పాటుపడువారు వీనిని గొని లాభము పొందుదురని నమ్ముచున్నాము.

గ్రంథకర్త వ్యవసాయ విద్యావిశారదులగు గోటేటి జోగిరాజు పంతులు గారు. మొదటిభాగము వెల రు. 1-4-0. రెండవభాగము వెల రు. 1-8-0

# అర్థశాస్త్రము.

దేశముయొక్క నిజస్థితిని, రాజకీయస్థితిని తెలిసికొనగోరు వారికి శాస్త్రమే శరణ్యము. విఖ్యాత పండితవర్యులగు క. రామలింగారెడ్డి. ఎం.ఏ. గారిచే వ్రాయబడినది. మొదటిభాగము వెల 1-8-0 రెండవభాగము 1-4-0

# మహాపురుషుల జీవనచరిత్రలు.

ప్రపంచమున మనుజులెక్కువగా పఠించవలసినవి మహాపురుషుల జీవనచరిత్రములు అయినను మన భాషయందట్టివి మిగుల తక్కువగా నున్నవి. జీవనచరిత్ర పఠనముచే పాశ్చాత్యదేశములో గొప్పగొప్పవారు పుట్టినారు. దేశమునకు మహోపకారము చేసినారు. స్మయిల్సువంటి గ్రంథకర్తలకు సామగ్రి నొసగినది. ఈ మహోద్దేశముతో మేమీ గ్రంథమును ప్రచురించియున్నాము. ఇందు ప్లూటార్కువర్ణిత చరిత్రలును, బెంజమిను ఫ్రాంక్లిను చరిత్రయు గలవు. ప్లూటార్కు మహాకవికి పాశ్చాత్యదేశములలో చాల మన్ననగలదు. ఫ్రాంక్లిను యోగ్యత లోకవిదితము. కావున గ్రంథవిషయ గౌరవమునుగూర్చి వివరింపవలసిన పనిలేదు. వెల. రు 1-4-0

గ్రంథకర్త ప. శ్రీనివాసరావు, బి.ఏ.,

---

విజ్ఞానచంద్రికామండలి, చింతాద్రిపేట, మదరాసు.

# ఆరోగ్యశాస్త్ర విషయక గ్రంథములు.

(డాక్టరు ఆచంట లక్ష్మీపతి గారిచే వ్రాయబడినవి.)

## చలిజ్వరము.

శీతజ్వరమనియు, మలేరియాయనియు మనవారలు చెప్పు నీఘోరవ్యాధినిగూర్చి సమస్తవిషయములు తేటతెల్లముగ వివరింపబడినవి. "కలరా" అకస్మాత్తుగ పైబడునదిగాన నయ్యది యనిన ప్రజలు భయకంపితులయి వెన్వెంటనే చికిత్సలనరయుదురు. చలిజ్వరము కలరాకంటెను ఎక్కుడు అపాయకరమైనది. ఇది మెల్లగ తెలియరాని విధమున నాటుకొని చెరుపు చేయుటంజేసి ప్రజలకు విశేషము భయముపుట్టుటలేదు. ఇందు తొమ్మిది ప్రకరణములు కలవు. జ్వరభేదములనుగూర్చియు, చరిత్రమునుగూర్చియు, లక్షణములనుగూర్చియు, నిదాన చికిత్సలను గూర్చియు, నివారించు పద్ధతులనుగూర్చియు చక్కగ వివరింపబడినది. జ్వరమూలములయి మనము నిర్లక్ష్యముగా నెంచు మలేరియా పురుగు, దోమ, మొదలగువాని చర్యలద్భుతముగా వర్ణింపబడినవి. క్యాలికో బైండు వెల 0-7-0 లు మాత్రమే.

## అంటువ్యాధులు.

అనేకవిధములయిన అంటురోగములనుగూర్చి సవిస్తరముగ వివరింపబడినది. ఈగ చేయు ఘోరమైనట్టియు అద్భుతమైనట్టియు కృత్యములెట్లు అంటువ్యాధుల వ్యాపింపజేయుచుండునో చదువుచుండిన శరీరము జలదరించును. ఇది ఆంధ్రవిజ్ఞానసర్వస్వమునందలి వ్యాసము. ఇప్పుడు ప్రత్యేకముగా పుస్తకరూపమున ప్రచురించియున్నాము. విజ్ఞానచంద్రికా పరిషత్తుయొక్క 1915 వ సంవత్సరపరీక్షకు పఠనీయముగా నేర్పరిచియున్నారు. వెల 0-8-0

## అతిమూత్రము.

ఈవ్యాధినిగూర్చిన సమస్త విషయములు వ్రాయబడుచున్నవి.

కలరా చలిజ్వరములయందు వలె నీగ్రంథమునందును, అనేక బొమ్మలను జేర్చి, మందులు, పథ్యపానీయాదులంగూర్చి వివరముగ తెలుపబడును! తయారగుచున్నది. చిరునామా:— విజ్ఞానచంద్రికా బుక్కు డిపో,

చింతాద్రిపేట, మద్రాసు.

# విజ్ఞానచంద్రికా గ్రంథమాల.

**మహమ్మదీయ మహాయుగము:**—హిందూదేశ చరిత్ర రెండవభాగము. రాజపుత్రులయొక్కయు విజయనగర రాజులయొక్కయు వర్ణనగలదు పటములుగలవు. మనోరంజకముగానుండును. 1-12-0

**రసాయనశాస్త్రము:**—దీనిని కెమిస్ట్రి అందురు దీనిని చదువనిది యే ప్రకృతిశాస్త్రము అర్థము కాదు. 1-4-0

**విమలాదేవి:**—విచిత్రమైన చరిత్ర విషయకనవల రంగుపటముకలదు ఇప్పుడింగ్లీషులోనికి భాషాంతరమగుచున్నది. 1-2-0

**చంద్రగుప్త చక్రవర్తి:**—హైందవచక్రవర్తి జీవితము, పరిపాలనావిధానము, రణకౌశలము మొదలగునవి వర్ణితములు. ఏభాషలోను ఇట్టి గ్రంథములేదు. 1-12-0

**ఆంధ్రులచరిత్రము:**—ఆంధ్రోద్యమమున కీగ్రంథమే మూలము చరిత్రాసక్తిగల వారలందరిచే మిగుల మన్ననబడసినది. రెండవభాగము 1-8-0

**స్వీయచరిత్రము:**—రా. బ. కందుకూరు వీరేశలింగము పంతులుగారిచే విరచితము. ఆంధ్రవాఙ్మయమున నిదిక్రొత్తరచన. నవలవలె మనోజ్ఞముగానుండును. మొదటిభాగము. 1-8-0

**ఢిల్లీదర్బారు:**—హైద్రాబాదు, మైసూరు, బరోడా రాష్ట్రముల చరిత్రలు, రాజదంపముల జీవితములు, ఢిల్లీపురవర్ణన దర్బారుల చరిత్ర వర్ణితములు 1-8-0

**రాయచూరు యుద్ధము:**—ఇదిక్రొత్త ప్రథమాంధ్రనవల. బహుమతికై వచ్చినవానిలో నిది ద్వితీయస్థానము నందెనది. కథ తీగవలె ప్రాకిపోవుచుండును. ఆంధ్రదేశాభ్యుదయమునకు ఆంధ్రదేశ చరిత్రాత్మక నవలలే మిగుల ఆవశ్యకములు: వెల 1-4-0

చిరునామా:—

విజ్ఞానచంద్రికామండలి,
చింతాద్రిపేట, మద్రాసు.

# పల్నాటి వీరుల కథలు



రచించినది

అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖర.

పండితుఁడు, టీచర్సు కాలేజి సైదాపేట.

ఇదివరకు

బెజవాడ హిందూహైస్కూలు పండితుఁడు,

ఆంధ్రసాహిత్యపరిషత్తు మేనేజరు, చెన్నపురి,

త్రిలింగ సంపాదకుఁడు, చెన్నపురి.



ముద్రించినది

ఇండియా ప్రింటింగు ముద్రాక్షరశాల, చెన్నపురి

1919

 [వెల. 0-8-0

# పల్నాటివీరచరిత్రకథాసారము.

---

ఉత్తరదేశమునఁ బాలమాచాపురియను పట్టణము కలదు. జంభనాపురియని దీనికి నామాంతరము. దీని ననుగురా జేలుచుండెను. ఇతఁడు కార్తవీర్యార్జునున కేడవతరమువాఁడు. కార్తవీర్యుఁడు చేసినపాపములు బాధింపగా ననుగురాజు బ్రాహ్మణోత్తముల యాలోచనవలన జీడినూనెగుడ్డలు ధరించి ససైన్యుడు, సామాత్యుఁడు, సధనుఁడు, సకులదేవుఁడునై రాజ్యము విడిచి పాపపరిహారార్థము తీర్థయాత్రలకు వెడలి నానా క్షేత్రంబుల సేవించుచు నదులలో మునుఁగుచు నంధ్రదేశమునకువచ్చి యమరావతిరేవునఁ గృష్ణానదిలో స్నానముచేయఁగా నల్లని జీడినూనెగుడ్డలు తెల్లనాయెను. ఇట్లు వస్త్రములు తెల్లనగుటయే పాపవిమోచనమునకుఁ జిహ్నమని బ్రాహ్మణులనుగురాజునకుఁ బ్రథమమునఁ జెప్పియుండిరి. అనుగురాజప్పుడు చందవ్రోలులో రాజ్యముజేయుచున్న రాజుకూతును వివాహమాడెను. ఆమెపేరు మైలాంబ. కూతునకుఁ జందవోలురాజు పల్నాడరణమిచ్చినందున ననుగురాజు గురిజాల రాజధానిగఁ బల్నాటి కధిపతియయ్యెను. అనుగురాజనకు భార్యలుమువ్వురు. వీరవిద్యాదేవి, భూరమాదేవి, మైలమాదేవి. వీరవిద్యాదేవి యందుఁ బెదమల్లదేవుఁడు, పినమల్లదేవుఁడు, బాలమల్లదేవుఁడు

నను మూఁగురు పుత్రులు గలిగిరి. భూరమాదేవియందుఁ గామ రాజు, నరసింహభూపతి, ఝట్టిరాజు, పెరుమాళ్లురాజు ననునల్వురుసుతు లుద్భవించిరి. అనుగురాజుమంత్రి దొడ్డనాయఁడు. ఇతఁడు వెలమ; జేతినాయని కుమారుఁడు. దొడ్డనాయని కొడుకులు బాదరాజు, బ్రహ్మనాయఁడు. బాదరాజునకుఁ బెద్దన్న యని నామాంతరముకలదు. సంతానము కలుగకముం దనుగురాజు చే బాదరాజు పెంచుకొనఁబడి క్షత్రియుండును గంచర్ల పురాధీశుఁడు నైన కృష్ణగంధర్వుని కూతును లవాంబను బెండ్లాడెను. బ్రహ్మనాయఁడు విష్ణువుగా భావింపఁబడుచున్నాఁడు. కురుక్షేత్రయుద్ధమునఁ గృష్ణుఁ డెంత ప్రధానుఁడుగా నుండెనో పల్నాటియుద్ధమున బ్రహ్మనాయఁడంత ప్రధానుఁడుగా నుండెను. ఈయన పల్నాటి కృష్ణుఁడని పేర్కొనఁబడు చున్నాఁడు. ఇతని కుమారుఁడు బాలచంద్రుఁడు. కన్నమదాసని మఱియొకఁడు గలఁడు.

ఇట్లు దొడ్డనాయఁడు మంత్రిగ ననుగురాజు కొంత కాలము పరిపాలించి మృతినొందెను. దొడ్డనాయఁడుకూడ స్వర్గమున కేగెను. నలగామరాజు పట్టాభిషిక్తుఁడాయెను. నాయకురాలను నొకయువతి నిజశక్తిచేత ననుగురాజు ననుగ్రహము సంపాదించి యతఁడు చనిపోయిన వెనుక నలగామరాజువద్ద మంత్రిణియయ్యెను. ఈనాయకురాలి యసలుపేరు నాగాంబ. నాయకురాలనియే సాధారణముగా వ్యవహరింపఁ బడుచున్నది.

నాయకురాలి జన్మస్థలము పల్నాడుతాలూకాలో నాగులేటియొడ్డుననున్న జిట్టగామాలపాడను నొక చిన్నగ్రామము.

ఈమె పంట రెడ్లకులమునఁ బుట్టినది. తండ్రిపేరు ఛాదరి రామిరెడ్డి. మేనమామ పేరు మేకపోతు సింగారెడ్డి. ఈమె యింటిపేర రవల్లి వారని చెప్పఁబడినది. ఇది తల్లిగారింటిపేరో యత్తగారింటిపేరో తెలియదు. ఈమె భర్త నామమెచ్చటఁ గానరాదు. పల్నాటి యుద్ధమున కీమెయే కారకురాలు. అతి పరాక్రమశాలిని. గుంజాల పురవరాధీశ్వరులగు నలగామరాజాదు లీమె చేతిలో కీలు బొమ్మలవలె నుండువారు. ఈమె బ్రహ్మనాయని కిరుపోటిగా రాజ్యతంత్రము నడపిన మహాసమర్థురాలు. యుద్ధావసానము వరకుఁ జలనమునొందక మగ బిరుదుకట్టి యశ్వారూఢయై బ్రహ్మనాయనితోఁ బోరసమకట్టిన నిరుపమానశూరురాలు........

ఈమె మంత్రిణి యగునప్పటికి వీరవిద్యాదేవికి జన్మించిన మల్లదేవాదులు బాలురుగానుండిరి. బ్రహ్మనాయఁడు వీరిని దగ్గఱకుఁ దీసి రాజ్యములోఁ గొంతభాగమిప్పించి [1]గురిజాలనుండి పోయి [2]మాచెర్ల పట్టణము నిర్మించుకొని వారు యుక్తవయస్కులు కానందున వారికి బదులుగఁ దానే పరిపాలించుచుండెను. వారు పెద్దవారైన తరువాతఁ గల్యాణ పట్టణాధీశుఁడైన వీరసోముని కుమార్తెలనిప్పించి వివాహముచేసి పెదమల్లదేవుని మాచెర్లకుఁ బట్టాభిషిక్తునిఁ జేసెను. అనుగురాజు చనిపోవునపుడు కొడుకుల నందఱను బ్రహ్మనాయనికి ఒప్పగించెను. నలగామ

---

1. పల్నాటి సీమలో ఉన్నది.

2. పల్నాటిసీమలో చంద్రవంక నదిమీద ఉన్నది. పల్నాడు గుంటూరు జిల్లాలో ఒక సీమ.

రాజు నాయకురాలిని మంత్రిణిగాఁ జేసికొన్నను మల్లదేవులకుఁ బెండ్లి చేసిన తరువాత బ్రహ్మనాయఁడు ద్వేషబుద్ధి లేక నలగామ రాజునకు భూరమాదేవి పుత్రులకుఁ గట్నములిచ్చుటకై గురిజాలకుఁబోయెను. వారును దగినవిధముల గౌరవించిరి. గురిజాలలో బ్రహ్మనాయనికి నాయకురాలు విషము పెట్టించెనుగాని యామె ప్రయత్నము నిష్ఫలమాయెను. మాయచేసి నాయకురాలతనినిఁ గోడిపందెమున నోడఁబఱచెను. ఓడిపోయినవారేడు సంవత్సరములు రాజ్యమువిడిచిపెట్టి పరభూములకుఁ బోవలయునని పందెపుటొడంబడిక, పందెములో బ్రహ్మనాయఁడోడి మల్లదేవుల వెంటఁబెట్టికొని మాచెర్ల విడిచి కృష్ణానదినిదాఁటి మండాదిపట్టణమునకు వలసపోయెను."

(దీనిని శ్రీనాథుని పల్నాటివీరచరిత్ర ఉపోద్ఘాతమునుండి యెత్తివ్రాసితిని.) ఇక్కడనుండి కథ యీగ్రంథములో ఉన్నది.

అ॥ ఉ॥



# పండితులకు విన్నపము

ఈ గ్రంథమునందలి రచనవిషయమయి కొంత చెప్పవలసి యున్నది. తెలుగువాక్యముల నడకలో కర్మణిప్రయోగము కానరాదు. కవబడు, వినబడు అనువానికి కర్మణిప్రయోగముల రూపము ఉన్నను, కర్మణిప్రయోగముల అర్థము లేదు. వానికి కన్నులుకనఁబడవు. నాకు చెవులు వినఁబడవు. ఇవి ఉదాహరణములు. నే నీగ్రంథములో కర్మణిప్రయోగమును సాధ్యమైనంతమట్టుకు మానివేసితిని. సముచ్చయములు "యు, ను" గాక సాధారణముగా వాక్యములలో సముచ్చయార్థమందు అంత్యదీర్ఘము కనబడుచున్నది. ఉదా "వాఁడూ వీఁడూవచ్చిరి. ఏదీ లేదు." ఇట్టి సముచ్చయములను నేను ఉపయోగించితిని. శనగలు, శేరు, ఇట్టివితప్పులని, సెనగలు, సేరు అని ఉండవలె. నని లాక్షణికులమతము. తెలుగులో "శ" లేదు గనుక శనగలు శేరు అని ఉండరాదని అభిప్రాయము. అయితే తాలవ్యశ్రుతి స్ఫుటముగా వినబడుచున్నది. వీనిని అచ్చ తెలుగులను కొని, ధ్వనికి భిన్నముగా అక్షరములను మార్చుటకంటె, అన్యదేశ్యము లనుకొని ఉన్నట్లుంచినయెడల దోషముకాదని తలఁచితిని. ఈ అభిప్రాయముతో శాలువలు అని ప్రయోగించితిని. ఇట్లే మఱికొన్నిగలవు. "భూచక్రగొడుగులు" ఇది చిత్రకన్ను,

పంచవన్నెలు అను శబ్దముల వంటిది. "కొను" అను ప్రయుక్తమగునపుడు యాన్తములకు ధాతువులకు సయితము ఇగాగమమును, ఆగమసిద్ధచకారములకు, దుక్కు, ముత్తు పరమగునప్పుడు పకారమును నిత్యముగా ఉన్నట్లు పూర్వగ్రంథములయందు సయితము కన్పట్టదు. సాధారణముగా వ్యవహారములో కానరాదు. కనుక నేను వానిని అంతగా పాటింపలేదు. చాలా, కూడా అని ఉండగా, చాల, కూడ అని దిద్దలేదు. అవి చాలు, కూడు అను ధాతువుల రూపములని యెంచక అవ్యయములని యెంచి ఉన్న రూపములను ఉన్నట్లుంచుట దోషముగాదని తలఁచితిని. ఉ॥ చాలాకాలము, వాఁడు కూడా వచ్చెను. శబ్దములకు వికారము కలుగలేదు. "ప్రయుక్తానాం శబ్దానాం సాధ్వసాధు వివేకాయ శాస్త్రారమ్భాత్."

మదరాసు,
8—1—1919.

అక్కిరాజు ఉమాకాన్తమ్.



# పల్నాటి వీరుల కథలు



## మండాది వలస

గురిజాలకోడిపోరులో బ్రహ్మనాయఁడు ఓడిపోయెను. పందెముప్రకారము ఓడినవారు ఏడేండ్లు మండాదిఅడవులకు వలసపోవలయును. బ్రహ్మనాయఁడు మలిదేవరాజునకు ఈసంగతి తెల్పెను; మాచెర్ల కాపులకు, కరణాలకు తెల్పెను. కాపులు "స్వామీ మలిదేవరాజుపాలనక్రింద అన్ని సౌఖ్యములను, అనుభవించుచున్నాము. నలగామ రాజుమంత్రిణి నాయకురాలికి, మమ్ము మీరు బప్పగించి పోఁ దలఁచినారు. పాలుపంపులలో, పంటలలో, పన్నులలో, కొలతూములలో, ఆమె మమ్మును బాధించును. మేమిక్కడ ఉండలేము. మీవెంట అడవులకు వత్తుము. అడవుల నయినా దున్నఁగలము గాని నాయకురాలి చేతి క్రింద ఉండలేము" అని విన్నవించిరి.

"కరారు తప్పి బ్రహ్మనాయఁడు కాపులను వెంటఁ దీసికొనిపోయి ఊరు పాడుపెట్టెనని శత్రువులాడుదురు. కనుక మీరు మాచెర్లలోనే ఉండవలసినది" అని బ్రహ్మనాయఁడు పలికెను. కాని ప్రజలు వినలేదు. వెంటవచ్చుటకు బ్రహ్మనాయఁడు ఒప్పుకొనెను. బయలు దేరవలసినదని ఊరిలో చాటించిరి.

వీరులను వెంటఁబెట్టుకొని బ్రహ్మనాయఁడు చెన్నకేశవునిగుడికి పోయెను. స్వామి ఆభరణములుతీసి పెట్టెలో పెట్టిరి. చెన్నునికి చివర మొక్కు మొక్కిరి; తక్కిన దేవతలకు మొక్కిరి; భైరవునకు భుక్తిబెట్టిరి; తిరిగి యిండ్లకువచ్చిరి; సరుకులు బండ్లకెత్తినారు; అందలాలు, గుడారాలు, పల్లకీలు, సిద్ధపఱచినారు. మాచెర్లనుండి బయలుదేరవలసిన అదివారము వచ్చినది. వీరమాతలు, వీరభార్యలు, రాణులు, అందలాలలో ఎక్కిరి. వీరులు, రాజులు, గుఱ్ఱములెక్కిరి. సైన్యముకదలినది. పశువులు కదలినవి. గండికోటదాటిరి. నాగార్జునకొండ దగ్గరకు వచ్చిరి.

అక్కడి మంత్రవాదుల మహిమలు, పులుల భయంకరమైన కథలు బ్రహ్మనాయనికి జనులు వినిపించిరి. చుక్కల గుండము దాటి, కన్నులకుంటదాటి పెనవోటుకు వచ్చిరి. ఈ అడవి యెట్లు దాటుదుమో అని జనులందరును గజగజవణకుచు ప్రయాణము చేయుచుండిరి. పెద్దపులి ఆ గుంపులోనికి రానే వచ్చినది. కలవరము హెచ్చెను. ఎద్దులు, ఆవులు, బెదరి, చెల్లాచెదరాయెను. నలగామరాజు మనుష్యులు వచ్చినారని బ్రహ్మనాయుఁడు అనుకొనెను. చివరకు పులి అని స్పష్టపడినది. లంకన్న, గండుకన్నమనీడు, పులిమీదఁబడి చంపిరి. చివరకు ఏలేశ్వరము వద్దకువచ్చిరి. ఏలేశ్వరము వద్ద కృష్ణానదినిదాటి వారు పలసఅడవులకు పోవలెను. రాణులు, దాసదాసీజనము, పుట్లెక్కి కృష్ణదాటిరి. సైన్యముదాటెను. పశువులు ఈది

అద్దరిచేరినవి. రాజు లెక్కినపుట్లు బయలుదేరినవి. మొసలి ఒకటి యెదురుగావచ్చెను. మంటలు గ్రుక్కుగ్రుప్ప, మొగలి పువ్వువంటి ముక్కుచాయ, మిసిమి వాడికోరలు, బడ్డురాళ్ల వంటి ఒడలి చిప్పలు, అది ఎంతో భయంకరముగా ఉన్నది. నాయకురాలి కుట్రచే మంత్రవాదులు చేసిన పంపు అని వారు అనుకొనిరి. వీరులు దానిని పొడిచిరి. అది నడినాతా అల్ల కల్లోలము చేయుచు మలిదేవరాజు పుట్టిమీదికి పోవుచున్నది. బ్రహ్మనాయుడు ఉగ్రుడై మొసలికి అడ్డముపోయెను; సుడి గుండము లన్నిటిలో దానిని త్రిప్పలఁబెట్టెను. రాజు పుట్లు దరిచేరినవి. బ్రహ్మన్న మొసలితో పోరాడుచున్నాడు.

మొసలి జవము తగ్గలేదు. బ్రహ్మనాయుడు నీటిలో మునింగి కొంతసేపు రాలేదు. మొసలిదెబ్బలకు చచ్చె బ్రహ్మనాయుడు నీటమునిఁగెనని రాజులు, వీరులు, భటులు, దుఃఖపడిరి. బ్రహ్మనాయుని దేహమును వెతకి తీసికొనిరమ్మని బెస్తలను పంపిరి. వారు మునింగి అంతటా వెదకిరి. ఎక్కడను బ్రహ్మనాయుని దేహము కానరాలేదు. ఆశలు వదలుకొనిపోయిరి; రాజులకు విన్నవించిరి. వారి దుఃఖము అధికమైనది. బ్రహ్మనాయుని తల్లి శీలమ్మ, రాజులవద్దకు వచ్చెను.

“ మీరు ఎంతమాత్రమును చింతపడవద్దు. కొండలు రాలితే, సూర్యుడు పడమట పొడిచితే, సముద్రములింకితే, బ్రహ్మనాయుడు వచ్చెనని అనుకోనవలసినది. బ్రహ్మనాయుడు మొసలిచేత చచ్చేటు వాడుకాఁడు. నాకుమారుని మనుష్యుడు చంప

లేదు. మృగముచంపలేదు. జాతకమును చూచినను బ్రహ్మనకు ఇప్పుడు చావులేదు. నాకుమారుఁడు వీరుఁడు మొసలిని చంపునుగాని మొసలి నాకుమారుని చంపదు" అని శీలమ్మ రాజులకు చెప్పినది.

ఇంతలో బ్రహ్మనాయఁడు నీటిపైకి వచ్చెను. మొసలి దవడలను కాలితో తన్నినాఁడు. కాళ్లను నడుమును నఱికినాఁడు. ప్రవాహము ఎఱ్ఱబడెను. జలమును క్షోభపఱచి మొసలి ప్రాణములు విడిచినది. బ్రహ్మనాయఁడు పోయి ఒక గుంటిమీఁద నిల్చెను. అప్పటినుండి అది నాయునిగుంటు అని ప్రసిద్ధికెక్కినది. రాజులు, దొరలు, వీరులు, జనులు సంతోషించిరి. కొలువు చేసి సభలో బ్రహ్మనాయని మలిదేవరాజు గౌరవించెను. నాయని గౌరవముకొరకు బ్రాహ్మణులకు వస్త్రములు, శాలువలు ఇచ్చిరి. బ్రహ్మనాయనికి ఆభరణములు సమర్పించిరి. మరల బయలుదేరి అందఱును మండాదికానలకుచేరి అచ్చట విడిసిరి. మేడలు, ఇండ్లు కట్టిరి. రాజుల కొలువుకూటములు తీరినవి. దొరల మొగసాలలు ముగిసినవి. గోపురములు లేచినవి. వీథు లేర్పడ్డవి. అంగళ్ళు వెలసినవి. మండాది ఒక పెద్దపట్టణమాయెను. వీరిక్కడ ఏడేండ్లు వలసకాలము గడుపవలసియున్నది.

కోడిపోరునభూమి గొబ్బుననోడి । ఓడినమాచర్ల వలసలుగట్టి
పండినపల్నాటి పంటలు విడిచి । నిండినమాచెర్ల నిధులను విడిచి
మలిదేవరాజును మన్నెనాయకులు । మండాదికానల మణఁగియున్నారు.

# మందపోటు



కాపులు భూములను సాగుచేసిరి. పంటలో పదవభాగము రాజున కిచ్చుచుండిరి. బ్రహ్మనాయఁడు రాజ్యతంత్రము నడపుచుండెను. ఇఁక గురిజాల వృత్తాంతము. గురిజాలలో నలగామరాజు కొల్వుతీరెను. నరసింహభూపతి, నాయకురాలు, కొల్వుకూటమునకు వచ్చిరి. వీరులు, మన్నీలు పన్నెండిండ్ల పద్మనాయకులు వచ్చిరి. పరదేశరాజులంపఁగా కాన్కలు తెచ్చిన రాయబారులు మొగసాలలో ఉన్నారు. వారిని నలగామఁడు లోనికి రా అనుజ్ఞ యిచ్చెను; కాన్కలు తీసికొని వారిని గౌరవించెను. కొల్వుకూటమున ఉన్న వారందఱును వినుచుండఁగా నాయకురాలు లేచి "ప్రభూ నామనవి వినవలసినది. బ్రహ్మనాయనిదుర్నీతి మీరు తెలిసికొనియే యుందురు. పందెపు నీతి తప్పి కాపులను వెంటగొనిపోయినాఁడు. పాడుబెట్టిన ఊళ్లను మనకు వదలిపెట్టినాఁడు. జనములేని పాడుబడ్డ రాజ్యమును మనమేమి చేసికొందుము? మనము బ్రహ్మనాయని ఊరక వదలిపెట్టుట నీతికాదు. పందెము దప్పిన బ్రహ్మనాయని పట్టి తెప్పించవలెను. వారిని చీకాకుపఱచవలెను. వారు మనకునష్టముచేసినట్లు వారికి మనము నష్టముచేయవలెను" అని చెప్పినది.

నాయకురాలి మాటలకు నలగామరాజు సమ్మతించెను. నాయకురాలు ఒక బ్రాహ్మణుని పిలిచినది. "నీవు మందాడికి

పోవలెను. ఆ పట్టణము, అచ్చటి ఆవులమంద, ఏ తీరున ఉన్నది చూచివచ్చి మాకు తెలుపవలెను. నీకు అగ్రహారమిచ్చెదము" అని ఆ బ్రాహ్మణునితో అన్నది. బ్రాహ్మణునికి తాంబూల మిచ్చినది. అతఁడు మండాదికి బయలుదేరెను. కోట గవఁకులు దాఁటి, రేవంతుని బైలుదాఁటి కోడిపోరుగుట్టలుదాఁటి, కంభము పాడుదాఁటి, నాగార్జునకొండదాఁటి, బ్రాహ్మణుఁడు ఏలేశ్వరపు రేవుచేరెను. అద్దరికి పోయి స్నానము చేసినాఁడు. మొగమున అక్షతలు పెట్టినాఁడు. సరుకావిధోవతి కట్టినాఁడు. గొడుగు పట్టినాఁడు. తిన్నగా మండాది ప్రవేశించెను. పంచాంగము చెప్పువానివలె నటించుచు అతఁడు రాచనగరికి పోయెను. వాడవాడలుగా తిరిగెను. మండాది అంతా కలయఁజూచెను. మండాదివిడిచి అతఁడు పసువులమంద దగ్గరకు పోయెను. మందలకు నాయకుఁడు లంకన్న. బ్రాహ్మణునికి కొన్ని ఆవులను లంకన్న దానమిచ్చెను. బ్రాహ్మణుఁడు అంతటితో తృప్తిపడ లేదు. "కొండెములకోరివి, కపటాలపెట్టె, జిట్టగామాలపాటి జెట్టి, నాయకురాలు మా అగ్రహారాలు తీసికొన్నది. బ్రహ్మనాయఁడు పల్నాటిని విడిచినది మొదలు నాయకురాలు బ్రాహ్మణులను బాధలుపెట్టుచున్నది. మమ్మును కడగండ్ల పాలు చేసినది. కనుక నీ కడకు వచ్చితిని" అని బ్రాహ్మణుఁడు చెప్పెను. లంకన్న నమ్మెను; ఇన్నూరు మాడలిచ్చెను. బ్రాహ్మణుఁడంతట బయలుదేరెను. భీముని కురవదాఁటి, ఏలేశ్వరము వద్ద కృష్ణదాఁటి, అతఁడు తిరిగి గురిజాలచేరెను.

నలగామరాజు కొలువుతీర్చి కూర్చున్నాడు. బ్రాహ్మణుడు వచ్చెను. "ఓహో మండాదివైభవము! ఆకోటలు, ఆపేటలు, ఆ రాచవీథులు ఏమని చెప్పుదును? ప్రజలు అచ్చట సర్వసౌఖ్యములు అనుభవించుచున్నారు. మాచెర్లను కలలోనైనను తలపెట్టరు. పల్నాడు విడుచుట వారికి భాగ్యమే అయినది. అచ్చటివీరులు పులులనైనను, సింహములనైనను సాధింతురు. వారిపశువుల మందలోనికిపోతే ఆకలిదప్పులుపోయును. దూడలు, కోడెలు, ఆవులు కన్నులపండగగా ఉన్నవి. చుక్కలను లెక్కపెట్టవచ్చును గాని ఆ పశువులను లెక్కపెట్టలేము" అని అతడు మండాది సంపదను పొగడెను. తరువాత నాయకురాలు లేచి "స్వామీ! నా విన్నపమాలకింపవలసినది. బ్రహ్మనాయడు పంతముదప్పి రాజ్యము పాడుపెట్టిపోయినందుకు కసితీర్చుకొనవలెనని నేను ఇదివరకు చెప్పినమాటను అంగీకరించితిరి. బ్రహ్మనాయని పట్టి తెప్పించవలెను. దానికి ఉపాయము చెప్పుచున్నాను. మలిదేవుని ఆవులమందను పోడిపించవలెను. వారికి తీరని నష్టము కలుగును. పిమ్మట వారిని మండాదినుంచి తరిమివేయవచ్చును. మరల మాచెర్లను తలపెట్టకుండా పారిపోవుదురు. పోరులు సమసిపోవును. మనము సుఖముగా రాజ్యము ఏలవచ్చును" అని చెప్పినది.

ఆ సభలో చింతపల్లి రెడ్డి, ఖాదరి అనువారు గలరు. వీరిద్దఱును రాచకార్యములలో సలహాలిచ్చుచుందురు. నాయకు

రాలి మాటలకు ఛాదరి ఒప్పుకొనెను. చింతపల్లిరెడ్డి సమ్మ తింపలేదు. "వారు భూమిని కోడిపోరులో కోల్పోయిరి. ఇది మనకు తగవుమాలిన గెలుపు. అయినప్పటికిని బ్రహ్మనాయుడు ఒడబాటు తప్పక పరభూమికి పోయెను. దేవరసీమ గుత్తకు తీసికొని అక్కడ ఉన్నాడు. వలదన్నను వత్తుమని కాపులు నెంబడించినందున, బ్రహ్మనాయుడు వారిని తీసికొని పోయెనుగాని అతని దోషము ఏమీలేదు. రాజ్యము పాడుబెట్ట వలెనను దుర్బుద్ధి అతనికి ఏమాత్రమును లేదు. బ్రహ్మనాయ నికి మనమీదనే కసి ఉండవలయునుగాని అతనిమీద మనకు ఉండుటకు ఏమీ కారణము లేదు. వారితో కలహము పెట్టు కొని గెలుచుట కష్టము. ఆడవారిమాటల కేమిగాని యుద్ధము సంభవించినయెడల బ్రహ్మనాయనికి సమమైనవాడు మనలో ఎవరున్నారు? ఆకొన్న పులికోర అణచెడు వాడు, శేషుని కోరకు చెయిచాచు వాడు, బ్రహ్మరాక్షసునైనా పడగొట్టు వాడు బ్రహ్మనాయుడు. అతనిని కదలించుట ఆటలాడుటగాదు" అని చింతపల్లి రెడ్డి నాయకురాలిమాటలను కాదనెను. నాయకు రాలికి కోపమువచ్చినది. "స్వామీ వింటిరా ఈతని విపరీతములు. ఇతడు పగవారిపక్షమున చేరినాడు. పగవానిని భట్టువలెపొగడి నాడు. పాములతో చెలిమి పాటింపవచ్చునుగాని ఇట్టివానితో భాషింపరాదు. మన వీరులు గండరగండలు. ఒక బంటులా వెంత! ఒకని ఆయువెంత! ఒకని సాహసమెంత! ఇతడిట్లు పక్ష పాతముచేత పల్కుచున్నాడుగాని!'' అని రాజుతో నాయకు

రాలన్నది. చింతపల్లి రెడ్డి తిరిగి తన వాదమును సమర్థించు కొనెను; బ్రహ్మనాయుని శక్తిని పొగడెను. "స్వామీ! ఇతని మాటలు నాచెవులకు సూదులుగా ఉన్నవి. మీకు విన మనస య్యె కాఁబోలు. ఇట్టి కొల్వుకూటములో ఇఁక నేను ఉండ లేను. నేనుగాకున్న నావంటి వారెందఱో మీకు మంత్రు లగుదురు. కడుపులో పలి చిచ్చు; కంటిలో నెరసు; నడిదల కెక్కిన విషము; నట్టింటి నాగుబాము; ఈస్వామి ద్రోహి ఉన్న పీఁట ఉండుట ఉచితముకాదు. ఓరాజా నన్ను పంపవల సినది" అని నాయకురాలు పలికినది. చింతపల్లి రెడ్డిమీద నలగామరాజునకు కోపమువచ్చినది. చింతపల్లి రెడ్డిని కొల్వు లోనుండి వెళ్లఁగొట్టించెను. గురిజాలరాజ్యము వదలిపోవలసిన దని రెడ్డికి ఆజ్ఞయిచ్చెను.

చింతపల్లి రెడ్డి తనబలగమును వెంటఁబెట్టుకొని పర భూములకు బయలుదేఱినాఁడు. మాడుగులవద్ద విడిసినాఁడు. చింతపల్లి రెడ్డి పోఁగానే నలగామరాజు కొలువు చిన్నఁబోయి నది. చందవ్రోలి చండినాయకుఁడు, చిట్టాలపోలి నాయ కుఁడు లేచి "రాజా! కోపము నీకు తగదు. మీరు కోపపడిన మేమెంతవారము? చింతపల్లి రెడ్డి, తనకు తోఁచిన మాట తానాడెఁగాక తప్పేమిచేసెను? రెడ్డివంటివానిని పోనాడవచ్చు నే? పోయినయెడల రానాడఁగలరా? ఇఁక మాటలెందుకు? రెడ్డి పోయి బ్రహ్మనాయని చేరఁగలఁడు? మన భూమి పాడయినట్లే. రెడ్డిని తిరిగి రప్పించినఁగాని క్షేమములేదు." అని విన్నవించిరి.

రాజు ఆమాటలకు సమ్మతించెను; రెడ్డిని తిరిగి తెండని మనుష్యుల పంపెను. రెడ్డివచ్చి కొల్వుకూటములో నిల్చుండెను. "నేనన్న మాటలకు నీకు కోపమువచ్చినదనుకొందును. పగవానిని పొగడితివి గనుక పట్టరానికోపమున అట్లంటిని. నీవు మా కొల్వులోనే ఉండవలసినది" అని రాజు రెడ్డితో అనెను. "స్వామీ! అనవలసినమాట లాడితిఁగాక. నాయందు తప్పేమి నరనాథ చంద్ర? నాయనిమీదికి నన్నంపుఁడు. నాశక్తికొలఁది పోరాడుదును. మండాదిని ధ్వంసము చేయుదును. పసువులను పొడుతును. నేను మీవాఁడనుగాని పగవారి వాఁడనుగాను" అని రెడ్డిపలికెను. రెడ్డి నిన్ను పంపవలసిన అవసరములేదు. మన్నె నాయకులెందఱో ఉన్నారు. వారిపనికిచాలు. నీవు కొల్వులో ఉండవలసినది అని రాజుపలికెను. రెడ్డి కూర్చుండెను.

చెంచులనాయకుఁడు వీథులపల్నీఁడు ఉన్నాఁడు. అతనికి గొప్పబలఁగము గలదు. అతనికి ఉత్తరమువ్రాసిన రేపేవరకు దుముకఁ గలఁడు. అతఁడు మందను పొడిచి మండాదిని పాడు చేయఁగలఁడు అని నాయకురాలు సలహా యిచ్చినది. పల్నీనికి లేఖలువ్రాసిరి. దూతలు బయలుదేరిరి. ఏలేశ్వరము రేవువద్ద కృష్ణదాఁటిరి; చెంచులమలలకు పోయిరి. లేఖలు పల్నీనికిచ్చిరి.

పల్నీఁడు తుడుములు వేయించెను. ధారలుమ్రోఁగినవి. బూరలుమ్రోగినవి. కంచుకొమ్ములు మ్రోగినవి. కనకతప్పెటలు మ్రోగినది. చెంచుబలము తరలినది. పల్నీనికి అంభారి సిద్ధమైనది. పల్నీఁడు ఏడుచలువలుతీరిన చల్లడము తొడిఁగినాఁడు.

దానిమీద పట్టుకాశచుట్టెను. పట్టుకాశమీద హనుమంతకాశ, హనుమంతకాశమీద రేవంతముల్లు, రేవంతముళ్ళపై పింజముల దండ, పింజములదండపై పికిలి కురువేరు, వెలపట వంకిణి, దాపట బాఁకు, చేత కఠారి, వీపున అంబులపొది. ఈ తీరున శూరవేషము పల్నీఁడు తాల్చెను; సిద్ధమైన అంభారీని ఎక్కెను. పోతినీఁడు, చెంచులమల్లన్న, ఆతని వెంట కదలిరి.

ఈ ముగ్గురు సరదార్లు ముందునడచిరి. బలమంతా ఖో యని అరచుచు వెనుకవచ్చుచున్నది. నీలి టెక్కెములవారు. భూచక్రగొడుగులవారు, విచ్చుకత్తులవారు, పచ్చబెత్తములవారు, చేకత్తులవారు, పిడిబాఁకులవారు, చక్రాలవారు వచ్చుచున్నారు. కృష్ణనద్దకుచేరిరి; కృష్ణకుమ్రొక్కిరి; కృష్ణదాటిరి; దూతలు ముందుగా గురిజాలకుపోయిరి.

పల్నీడు వచ్చుచున్నాఁడు. పాలువాయిమిట్టలవద్దకు వచ్చినాఁడు అని రాజునకు చెప్పిరి. పల్నీనికి ఎదురుగా నాయకురాలు బయలుదేరినది. పల్నీనికలిసికొన్నది. "కోడి పోరున భూమిని ఓడి బ్రహ్మనాయఁడు మండాదిపట్టణము కట్టినాఁడు. మండాదిని పాడుచేయవలెను. మందను పొడువవలెను. పల్నీఁడా ఈపనికి నీకు మాచెర్ల ఇత్తును" అని నాయకురాలు పలికినది. పల్నీడు పౌరుషముచూపెను. పోతినీను పులిమీసము లనెను. మల్నీఁడు మా కెన్వరెదుర నెను.

నాయకురాలు వీరిని వెంటఁబెట్టుకొని గురిజాలకు పోయినది. అందఱును నలగామునికొల్వుకూటమున కలిసిరి. మం

డాదిని హతముచేయవలసినది, మాచెర్లయిత్తును అని నలగామ రాజు పల్నీనికి చెప్పెను. పల్నీడు తన బలిమిని, ధైర్యమును రాజునకు తెలిపెను. తాంబూలము, కట్నములు, బంగారు ఆభరణములు, ముత్యాలహారాలు రాజు పల్నీనికి ఇచ్చెను.

పల్నీడు బలగమునుతీసికొని మండాదికి పైనమాయెను. వీరు మాచెర్లకు పోయిరి. చెన్నకేశవునకు మ్రొక్కిరి. తిరిగి బయలుదేరిరి. అన్నమువారిపల్లె, కొత్తకోటదాటి పెందోటకన్నమకు చేరిరి. అక్కడ నలగామునితోట ఉన్నది. ఆ తోటలో రకరకాల పుష్పాలూ ఉన్నవి. తోటలో ప్రవేశించి చెంచులు పూలుకోసికొనిరి; చెవులలో బెట్టుకొనిరి; తలలలో చుట్టికొనిరి; మెడలలో వేసికొనిరి; తిరిగి బయలదేరి గుండాలబాటకు చేరిరి.

మందను మండాదిని చూచిరమ్మని పల్నీడు వేగుల వారి నిద్దరిని పంపెను. వారు హరిదాసుల వేషమువేసుకొని మండాదికి పోయిరి. ఓరుగంటి వైష్ణవులము, తిరుపతికి పోవు చున్నామనిరి. వీరిది మోసపువేషమని మండాదిలో తెలిసినది. తప్పించుకొని బయటబడ్డారు. తరువాత వీరు పశువులమందకు పోయిరి. ఆ మందకు ఒకప్రక్కన గుడ్లేరు. తక్కిన వైపుల వెదుళ్లు తుమ్మలు కిఱ్ఱుమని కలిసికొనిపోయి ఉన్నవి. ఆవరణ ములోపల చవికెలున్నవి. మందిరములున్నవి. ఆటకూటమ్ము లున్నవి. దుందుభులున్నవి. నాయకుడున్నాడు. బోయలు న్నారు. పుల్లావులపోతన్న, బూరుగచెన్న, నర్రావుల ప్రోలు

నాగన్న, కొరవిరామన్న, కొండబోయఁడు, పరిగంమాలె బోయఁడు, బాలెబోయఁడు, కన్నెమేకల చెన్నబోయఁడు, కాటిబోయఁడు, పింఛము సింగన్న, పిన్నబోయఁడు, గుండెబో యఁడు, గూబరామన బోయఁడు, తోడేటి దామనబోయఁడు, దోరబోయఁడు, నిలువుగాళ్ళ నిమ్మన, నిడిదబోయఁడు, తిక్క మేకల తిప్పబోయఁడు, తిరువీధి గింగన్న, దిండెబోయఁడు, మట గాళ్ళమాచన్న, మల్లెబోయఁడు, ఎడమగాళ్ల యెఱ్ఱన, వీరు బోయలు. వీరికి నాయకుఁడు లంకన్న. ఇతనికి వెంకజోదు అని మఱియొక పేరుగలదు. మందకడకు వచ్చునప్పటికి వేగులవారు గొల్లబోయల వేషము వేసికొనిరి. లంకన్న వారిని చూచెను. వారిని నావద్దకు పిలువుమని పెయ్యాల వేర్నినిపంపెను. మాయ బోయలు వచ్చినారు. "మేము ప్రయాగమాధవుని పశువులకు బోయలము. పెయ్యలు, కోడెలు కొన్ని తప్పించుకొని పోయి నవి. వెదకవచ్చితిమి" అన్నారు. బ్రహ్మనాయఁడు నాకు అన్న. నాపేరు వెంకజోదు. మేము దేవుని పశువులజోలికి పోము. ఉన్న వేమెం వెదకి పట్టుకొని పోవలసినది" అని లంకన్న చెప్పెను. ఆవులన్ని మేఁతకు పోయినవి; సెలయేళ్ల ప్రక్క, పోతువాఁగులలో, చెరువు కట్టుకొమ్ముల, తెల్లమోదుగులలో, దేవదారులలో ఉన్నవి. చెంగలి, నేంద్రఁగడ్డి, సన్నగరిక, పులి గొండ, చిగిరింత, కుందురు, చిందరకసువు, మేయుచున్నవి.

ప్రొద్దుగ్రుంకెను. కోడిగ్రుడ్లవలె కుచుర్రైనవి, చింత పువ్వు వన్నెవి, చెంగల్వామచ్చలవి, ఇప్ప చిగురువన్నెవి, ఎన్నోరకాల

ఆవులు మందలు మందలుగా తిరిగివచ్చినవి. వచ్చిన మాయ బోయలు మందలుచూచిరి. మా ఆవులు ఇందులో లేవు ఇక పోదుము అనిరి. లంకన్న వారికి పాయస మిప్పించెను. తాగిరి; బయలుదేరి పోయిరి; మండాది ఇతరులకు అలవిగాదు మందలో మన్నీలను గెలుచుట కష్టము. పశువులు పోతరించి ఉన్నవి అని పల్నీనికి చెప్పిరి. పల్నీని సర్దారులు మండాదియెంత? మంద యెంత? నుగ్గుచేసెదమనిరి. పల్నీఁడు బయలుదేరెను. నలగాము సేన, చెంచులు, మన్నీలు, సర్దారులు, ఉత్సాహముతో వెంట నచ్చుచుండిరి.

### లంకన్న ఒరుగు.

పల్నీఁడు మందను పోడుచుటకు వచ్చుచున్నాఁడన్న సంగతి లంకన్నకు తెలిసినది. దుశ్శకునములు అగపడ్డవి. లంకన్న బ్రహ్మనాయని వద్దకుపోయి మందకురానున్న చేటును విన్న వించెను. పల్నీనితో యుద్ధముచేయవలసినదని లంకన్నకు బ్రహ్మనాయఁ డనుజ్ఞయిచ్చెను. లంకన్న తిరిగి మందకువచ్చి నాఁడు. లకన్న యుద్ధమునకు సన్నద్ధుఁడై కొల్వుతీర్చి కూర్చు న్నాఁడు. కూటువ మన్నీలగుండె తల్లడము, సింగనబోయఁడు వచ్చెను; లంకన్న పాదములకు మొక్కి కూర్చుండెను. కటా రిక బిరుదుకట్టి, అమ్మల దొనలకు అర్ధనారిఝల్లులుకట్టి, వింటికి నల్లఝల్లులుకట్టి, వీరగంధము పూసికొని పుల్లావుల పోతన్న వచ్చెను; లంకన్న పాదములకు మొక్కికూర్చుండెను. పట్టుచల్ల డముకట్టి, పట్టుకాసె బిగించి, పికిలికుంచెలకై జారుకత్తి షట్టి,

పెడలుతిరిగిన విల్లంది, బసివినీఁడువచ్చెను; వెంకన్న పాదములకు మ్రొక్కికూర్చుండెను. జముదాళిగట్టి, పొన్నాడబల్లెముపూని సోమినీఁడువచ్చెను; లంకన్న పాదములకు మ్రొక్కికూర్చుండెను. కరకపువ్వుల ధట్టిగట్టుకొని, ఒడలినిండా వీరగంధము పూసికొని అవసరము వల్లెబోయఁడు వచ్చెను; లంకన్న పాదములకు మ్రొక్కి కూర్చుండెను. లంకన్నకు మొలన చంద్రికపట్టుధోవతి, ఒంట శ్రీగంధము, మెడన చెంగల్వదండలు, మొగమున తిరుమణి తిరుచూర్ణము, డా కాల అందె, ప్రక్కనకత్తి, వీపున అమ్ముల పొది, చేత విల్లు, ఉన్నవి. ఆవిల్లు నెల్లఘుల్లులది, పసిఁడికట్లది, అర్ధచంద్రుని వంటిది. బ్రహ్మనాయని తమ్ములు తంభీముఁడు, వీరగాముఁడు అను ఇద్దఱు శూరులు మందలో ఉన్నారు. మీరు బ్రహ్మనాయని తమ్ములు, తప్పునో తాకునో, మీరు ఇక్కడ ఉండవలదు, మండాదిక పోవలసినది అని లంకన్న చెప్పెను. ఓహో! లంకన్నా! మేము రేచర్లకులదీప కులము, దొడ్డనాయని కుమారులము, శీలమ్మ నాయని తమ్ములము, నిండిన యీ మందనిధిని పోవిడిచి, పాయరానట్టి యీ బంధులవిడిచి, ఈడుబోయులనందఱినీ యుద్ధమునకువిడిచి, దండివీరుఁడా! మీమీఁద దయలన్నివిడిచి, జన్మతో ఉన్న మాశౌర్యమువిడిచి, ఏతీరు మండాది ఏగుదుముమోయి ? మండాది కిప్పుడు మరలము మేము అని తంభీముఁడు వీరగాముఁడు చెప్పిరి; లంకన్న మాకు బ్రహ్మనాయని మారు అనిరి. పల్నీడు మందకు దగ్గఱకు దగ్గఱకు వచ్చుచుండెను.

లంకన్న లేచినాఁడు ; ఆవులకు సాగిలి మ్రొక్కెను ; "ఆవులారా! ఇంతకాలము దనుక నాకు ఆవులు తల్లి, ఆఁబోతులు తండ్రి, అన్నలు తమ్ములు కోడెలు, అక్కలు చెల్లెండ్రు పెయ్యలు అని వావిదలఁచి ఉన్నాను. ఆవులు నోచ్చిన నాఁడు, వాన కురియక పూరి వాడిననాఁడు, ఆ యిడుములు బాపికాని నేను అన్నమని అనుకొనలేదు. కయ్యమునకు నేఁడు కాలమువచ్చినది. నా ప్రాణములుమీవి, నా శరీరముమీది; నా మనుగడ మిమ్ము పోషించుటకు, నా మగటిమి మిమ్ము రక్షించుటకు అని పలికెను.

మాచెర్ల వదలి మండాదికి వచ్చునప్పుడు, పెందోటలో బెబ్బులి కంట్లముకరికోడెను కరచిననాఁడు పసువులన్ని బెదరి పాఱిపోయినవి. కటికోడె యేదని నాయఁడు అడిగెను. పులి గరచెనని దీనుఁడనై చెప్పితిని. శీలమ్మవారి యింటి సీరాటి కడవ కరచి సిగ్గుతాగిన కలుగు మగతనము. మగతనము విడిచి పులి కరచినదని చెప్ప ధర్మమానీకు? కరచుచున్న పులిని కన్నుల చూచి ఊరకున్న పాతకులను నేను చూడలేను" అని బ్రహ్మనాయఁడాడెను. దేవా! తమరు పెడ మొగము పెట్టిన నాబ్రతుకేల? నామగటిమి కనబఱచఁగల రోజువచ్చు దనుక ఆడదానికన్న అధముఁడనై ఉందును. అని అంటిని. ఆవులారా! మిమ్మును కాపాడవలసిన రోజువచ్చినది. నా మగటిమి చూపఁగల రోజువచ్చినది. ప్రాణములైనా ఇత్తును పంతమైనా నెఱవేర్తును. ఆవులారా! నా శరీరములో ప్రాణములుండు

వరకు మీామీాద పోటు పడనియ్యను అని లంకన్న ఆవులకు మొక్కుచూ పలికెను.

ఆశేముత్యమరావె అలివేణిరావె, శ్వేతమామిడిరావె శ్వేదోటరావె అని ఆవుల పేరుపేరునా లంకన్న పిలిచెను. పాలు పితికించెను ; నురుగులతో పాలు సముద్రమువలె ఉప్పొంగినవి. పల్నీడు, చెంచులు మందకడకువచ్చిరి. బూరలు, ధారలు మ్రోసినవి. భేరీలుమ్రోగినవి. చెంచులు బొబ్బలుపెట్టిరి. ఆవులు బెదరినవి. మందఅంతా అల్లడితల్లడి ఆయెను. తంభీముఁడు, వీరగాముఁడు, చెంచులనెదిరించిరి, పొడిచిరి, చంపిరి. వీరిద్దరికితోడు ముత్యాలమల్లువచ్చెను. ముత్యాలమల్లుయుద్ధము చేస్నెను; నలగామునిసేనను కొంతవరకు కూల్చెను; చివరకు యుద్ధముఁలో చచ్చెను. మల్లు చచ్చినతోడనే అతనిభార్యకు పాపమ్మకు పట్టరాని ఆవేశము కలిగినది.

## పాపమ్మ

పాపమ్మ పసుపుచీరె కట్టుకొన్నది; పసుపురవిక తొడుగుకొన్నది ; చెంచులమీాదికి కదిసినది ; తన మగనిని చంపిన మన్నీలను చంపినది ; మరికొంత సైన్యమును పడవేసినది; చెంచులసోమిని చేతికొద్దీపొడిచినది. ఆమెచేసిన ఆయుద్ధమునకు చెంచులాశ్చర్యపడిరి. నలగాముని సేన, చెంచులు, అందఱునూ ఒక్కమొగికూడి ఆమెపై అమ్ములువేసిరి. సురసుర స్రుక్కినది ; మాచర్ల చెన్నుని తలఁచినది; ముత్యాలమల్లు ప్రక్కన పాపమ్మ కూలెను.

పాపమ్మ పడిపోయినది చూచి బోయలందఱు అరచిరి. చెంచులకు ఉత్సాహము హెచ్చెను. చెవులమన్నిడు చెంచులతో యుద్ధముచేసి ఒరిగెను.

పుల్లాపులపోతన్న, పింఛము సింగన్న లంకన్నను తలఁచి నేలకుఁ ద్రావాలిరి. సరదార్లు, మన్నీలు చెంచులచేతిలో చచ్చిరి. మందకురాజు లంకన్న. విల్లందుకొని లంకన్న యుద్ధము చేసెను. చెంచులసామినీఁడు, తాటిపోతినీఁడు, వీధులపల్నీఁడు లంకన్నను ఎదిరించిరి. లంకన్న తాటిపోతినీని తల తెగ వేసెను; వీధుల పల్నీని విసరిపడ వేసెను; చెంచులసామినీని చెండాడెను. చిత్తవర్షము వలె అమ్ములకురిపించెను. నలగామునిసేన, చెంచులు, లంకన్న చుట్టూ క్రమ్మిరి. అమ్ములువేసిరి. లంకన్నకు బాణము ఆయువుపట్టున తగిలినది. అక్కడను గరిగమాడచిని తలఁచినాఁడు; శీలమ్మ నాయాని చిత్తమున నిల్పినాఁడు; లంకన్న నేలకొరిగెను.

ఇఁక తంభీముఁడు వీరగాముఁడు ఇద్దఱున్నారు. వీరిద్దఱును చెంచులను నరికిరి; మన్నీలను మడియించిరి. పగవారిబలఁగములో నడిచెడు పాదములు, నడిమెముకలువిరిగినవి; గుండెలు, ప్రేవులు కూలినవి; కండలు తెగిపడ్డవి; నెత్తురు కాల్వలై పారినది; తలలు తెగిన మొండెములు తరచైనవి. చివరకు పగవారి దెబ్బలకు తంభీముఁడు వీరగాముఁడు ప్రాణములు విడిచిరి. మందకిఁక నాయకుఁడు లేఁడు. చెంచులు ఆవులమీద అమ్ములువేసిరి. కదుపులు చెలరేగినవి; కళపిళకళపిళకళపిళ కంచెను విరగఁద్రొక్కి

నవి. తోఁక లెత్తినవి కొన్ని, మోరలు మోపుచేసినవి కొన్ని ఆవులన్ని ఒక్క పెట్టున ఎగురుచు, ఉరుకుచు, రంకెలు వేయుచు, చిమ్ముచు, గట్టుల క్రింద లంకన్న చితుకుచుండఁగా చెంచు సేనల మీాద దుమికినవి; నలగద్రొక్కినవి. కోడెలను, చూడి ఆవులను, కొన్నిటిని చెంచులు చంపిరి. శంఖచక్రాలబసవన్న, శంభుఁడు అను ఆవులు చచ్చినవి. కాని మంద వెనుతీయలేదు. చెంచులను చీకాకుపఱచినవి. నలగాము సేనలో కట్టుబోతుల వారున్నారు. వారు ఆవులకు మరకట్లు కట్టిరి. ఆవులు చెంచులకు లోఁబడ్డవి. ఆవులను తోలుకొని గురిజాలకు చెంచులు బయలుదేరిరి.

పెయ్యాల పెర్నీఁడు ఒక్కఁడు మిగిలి ఉన్నాఁడు. పెర్నీడు మంచాడికిపోయి జరిగినదంతా విన్నవించెను; మందనుతోలుకొని పోరు బైళ్ళవరకు పోయిరని చెప్పెను; చెప్పి తిరిగి మందను కలియఁబోయి చెంచులచేతిలో పేర్నీఁడు చచ్చెను. బ్రహ్మనాయఁడు సుంకరినీని భీమునికనుమకు, గద్రాతి కనుమకు కన్నమనీని, అడ్డముపంపి తాను తలుపులకురవకు పోయెను. పసువులు అగ్నపడ్డవి. పసువులవెంట చెంచులున్నారు. బ్రహ్మనాయఁడు వారిని ఆపెను. ఎవరుమీారు? పసువులను ఎక్కడికి తోలుకొని పోవుచున్నారు? అని అడిగెను.

నలగామరాజు పంపిన మనుష్యులము. మలిదేవుని మందను పొడిచి, బోయలనందరినీ చంపి పసువులను తోలుకొని పోవుచున్నాము అని చెప్పి నీవెవ్వఁడవు, ఎందుకు వచ్చినావు అని

అడిగిరి. మీరు గద్దరితనమున కనమ దాఁటితిరి. పశువులను ఇఁక పోనీయను అని బ్రహ్మానాయఁడు అనెను. నీకీ ప్రల్లదము లెందుకు? లంకన్నంతటివాఁడు మా చేతిలో హతమాయెను. నీవొక లెక్క గాదు అని మన్నీలు పంతములాడిరి. బ్రహ్మనాయఁడు కట్టు బోతులపనిని త్రిప్పి వేసెను. ఆవులకు మరకట్లు పోయినవి. చెంచులను, మన్నీలను పడద్రొక్కి వెనుకకుమరలి తమ మందకు పోయినవి. మన్నెమూఁకలను బ్రహ్మనాయఁడు కూల్చెను. మన్నీలను చంపెను. బిరుదుబంటులు పృథివికి వ్రాలిరి. అప్పటికి బ్రతికియున్న ఆవులను మరల్చుకొని బ్రహ్మనాయఁడు పోయెను.

---

# అలరాజు రాయబారము



మూఁడు సంవత్సరములు మండాదిలో నిల్చి లంకన్నను మందపోటులో కోల్పోయిరి. పశువులు అనేకములు నష్టమయి నవి. ఇఁక మండాదిలో ఉండఁగాదని బ్రహ్మనాయఁడు నిశ్చ యించెను. శృంగారమద్దిదేవున కృష్ణ దాఁటిరి; శ్రీశైలమునకు వచ్చిరి. పర్వతమును భిక్షావలివాగు ఏలుచుండిరి. గరుడలపాలకి, పచ్చలపిడిబాకు కుదువబెట్టి భిక్షావలివారి దగ్గర భూపాటిసీమను బ్రహ్మనాయఁడు తెగఁగొనెను. ఒక పెద్దపట్టణమునుకట్టిరి. వీర మేడపి అని దానికి పేరు. మిద్దెలు, మేడలు, కోటలు, పేటలు, తీరినవి. ఆధారమని పేరుగల కొలువుకూటమును తీర్చిరి. వీరమేడపిలో నాలుగు సంవత్సరముల ఆరునెలలు మలిదేవుఁడు రాజ్యము చేసెను. అప్పటికి లెక్కలు చూచుకొనిరి. వారు మాచెర్ల విడిచి యేడుసంవత్సరముల ఆరునెలలాయెను. కోడిపోరులో ఓడిన నాఁటి ఒడంబడిక ప్రకారము యేడుసంవత్సరములే పరభూము లలో ఉండవలసి యుండఁగాఁ ఆయేడు సంవత్సరములు గాక అధికముగా ఆరునెలలు గడచినవి. ఎక్కువగా తీసికొన్న ఆరు మాసముల పన్ను నలగామఁడు మలిదేవునికి ఇయ్యవలసి యున్నది. ఇందుకు రాయబారము పంపవలెనని రాజులు తలచిరి. బ్రహ్మనాయని ఆలోచన అడిగిరి. "అలరాజు ఇరుపక్షములవారి

